# నరసమాంబ

## ( ఒక ఆదర్శగృహిణి జీవిత చరిత్ర )

"ఆ ముకుళించినట్టి కనులందు వెలుంగులు ముద్రితంబులై
తామ సచర్చలో బ్రతుకు దారుల శూన్యమె భీతిఁగొల్పు; తా
రామధుమూర్తివై గగనరాజ్యపమన్ వెలిఁగించు నీకు - మ
మ్మోముట యెంత వింతయుగు - సోజననీ - మసనీకృపాప్రపల్"

.... దిగుమర్తి

రచన :

తాడిమళ్ల జగన్నాథరావు

ఎం. ఏ., బి. యస్‌సి., బి. యల్.

భీమవరం

# అంకితం

ఆదర్శ గృహిణి

నరసమాంబ

తన జీవితాన్ని తన భర్త

వెంకటరామారావుగారి

పాదసేవకు అంకితం చేసికొన్నది.

ఆమె జీవితాన్ని చిత్రించే ఈ రచనకూడ

ఆయనకే

అంకితము



# పరిచయ దీపిక

పఠనానందము నొసంగు రచనలలో జీవిత చరిత్రలు చరమముగా పేర్కొనదగినవి. వ్యక్తి విశిష్టత జీవిత చరిత్రకు ముడిసరుకు; ఈ వైశిష్ట్యము ఏదో ఉద్యమముతో ముడివడి ఉండును. కాగా జీవిత చరిత్ర యుద్యమ చరిత్రగా మిగిలి విసుగు గలిగించును. సాధారణముగ జీవిత చరిత్రలు పాలకులు, కవులు, మతాధిపతులు, మహానాయకులకు సంబంధించి ఉండును. ఇందు కవుల చరిత్రలు తప్ప మిగిలినవి యుద్ధములు మతము రాజకీయములవంటి విషయములను గూర్చి చెప్పునవి యగుటచే వేసట గలిగించును. సాహిత్య మహాపురుషుల యనుభవములు జీవిత మథనమున వెలువడిన సార్వకాలిక ప్రకాశములగు మణులుగానుండి సుహృక్కుల నలంకరించును. కావుననె జీవిత చరిత్రలయందివి యుత్తమములు.

పై సిద్ధాంతములు ఆంధ్ర సారస్వతమునకు నన్వయించును. ప్రాచీన మహాకవుల కృత్యవతారికలు పద్యఘటితములైన జీవిత చరిత్ర ఖండములు. ఇవి రసభావ ప్రధానమైనవి. విషయ ప్రధానములైన విపుల గద్య జీవిత చరిత్రలు మనకాధునికములే. ఉన్నంతలో కవుల కథలే మేలేర్చినవి. కాని ప్రస్తుత గ్రంథము పైచెప్పిన యే వర్గమునకును చెందని యొకవిలక్షణ స్వభావము గలది.

ఇది ఆదర్శ గృహిణీ జీవితము గడిపి కుటుంబమునకు దేవతయైన ఒక ఇల్లాలి సరళగాథ. ఆమె-యా- ధర్మబద్ధ

కళామయ జీవితమునకు కీర్తి ప్రతిష్ఠ లానుషంగిక ఫలములు. దేశకాల పాత్రముల విలువ యెరిగి ప్రవర్తించుట ఆమె లక్ష్యము. సుపుత్రవతి యగు ఈమె ధన్యురాలు.

ఈ యమ పుత్త్రరత్నము సహృదయుడైన తాడిమళ్ళ జగన్నాథరావుగారు, దుర్భర మాతృ వియోగ పరితప్తుడై ఈరచన మొనరించెను. జనని లోకాంతరస్థితిభావన ఈకుమారమణికి దుస్సహమైనది. భర్తగారైన రామారావుగారు తలచి కంటతడి పెట్టని సందర్భము లేదు. 'ఇవే హృదయ మర్మచ్ఛేదములైన సంసార భావముల'న్న మహాకవి సుభాషితము వీరి తపన మాచినప్పుడెల్ల స్ఫురించును. ఈ గ్రంథము ఈ తండ్రి కొడుకుల మనస్సునకు కొంత శాంతిని సంతరించు గాక!

గ్రంథమున ఆచరణ దుస్సాధములగు విషయముల సేకరు పెట్టుట లేదు. లక్ష్మీ నరసమాంబగారి పద్ధతు లన్నియు సూక్ష్మములో మోక్షములు. నిరాడంబర జీవితమును కుటుంబక్షేమమును ఇరుగు పొరుగుల శ్రేయమునను సంధించుటచే ఆమె పూజ్యురాలైనది. జీవితమునకు అన్వయించి రచయిత క్రొత్త విషయములు చెప్పలేదు. పునరుక్త భుక్తమైన సాధారణ జీవితమున గతానుగతికములు నిరూపించుటలో రమ్యముగా నవలవలె చిత్రించుటయే ఇందలి ప్రత్యేకత. ఇదియే ఈ రచనలోని సొంపు. ఆమూలచూడము ప్రవాహ శైలిని కథనము సాగినది. కావుననె చదువరి చదువు చున్నట్లని

పింపక ముగింపునకు వచ్చివేయును. చాటు మాటు సేయక సందర్భములు వర్ణించు నప్పుడును వాతావరణ కల్పకమైన రీతి ప్రీతినించును. ఇది భావ చోదితమైన కథనము. వ్రాయ వలెనని వ్రాసినదికాదు. అంతర ప్రేరణ వ్రాయించినది. ఇదియే ఈ కూర్పులోని మధురిమ రహస్యము.

మనలో మధ్యవర్గమునకు సంఖ్యా బలమును సంస్కారబలమును గలదు. ఐనను నేటి గృహిణులకు లక్ష్యశుద్ధి లేకుండుటచే చిదికిన సంసారములే పెక్కులు. ఆంధ్రమహాభారతమున నన్నయ్యగారు శకుంతల నోట చెప్పించిన-

సీ॥ ధర్మార్థ కామ సాధన కుపకరణంబు
గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్రశిక్ష కాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికినూంత
గౌరవంబున కేక కారణం బున్నత
స్థిర గుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె ... ... ...

యను పలుకులు నరసమాంబగారి పట్ల ప్రత్యక్షర సత్యములు. ఆమె బ్రతికినంతకాలము ఆప్తుల కన్నుల వెన్నెలగా ఆర్తుల కాలంబన యష్టిగా బ్రతికిన మహిళ. క్రేణింపక క్రొత్తదులు చిత్తగింపవలసిన పాత్రమిది.

ఇట్టి యాచరణ సులభ జీవితాదర్శనము కాలరంగమున మఱవు తెరల కనుచాటు గాకుండ అక్షర బద్ధము చేసిన రచయిత సారస్వతుల కభినందనీయుడు. దీని వలన ఆయన సుతుడుగా తన కర్తవ్యమును నెరవేర్చుకొన్న వాడే గాక— సామాజికుడుగా గేస్తురాండ్రకుసుఖసంసార మార్గము నెరింగించిన సోదరుడయ్యెను. సహృదయులీ వర్ధిష్ణువు నాశీర్వదింతురు గాక !.

శా॥శ॥ ౧౮౮౧
వికారి : మార్గశీర్షము

దిగుమర్తి సీతారామస్వామి
(ప్రాచ్యభాషా పీఠాధిపతి - భీమవరం కళాశాల)

---

# కృతజ్ఞత

మా తల్లిగారి పవిత్ర జీవిత చరిత్ర ఆధారంగా రచించినదే ఈ రచన. కొన్ని చిన్న పాత్రల పేర్లుమాత్రం కల్పితము. చక్కని విశేషాల నందించిన బంధుమిత్రులకు, వ్రాత ప్రతులుచూచి తగు సలహాలనిచ్చి పరిచయదీపిక నొసంగిన ఆచార్య దిగుమర్తి సీతారామస్వామిగారికి, మా తల్లిగారి జన్మదిన సందర్భమున శ్లోకములు వ్రాసి పంపిన కవిసార్వభౌములు, ప్రభుత్వ ఆస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారికి, ముఖచిత్రం చిత్రించిన మిత్రుడు మంగళంపల్లి సూర్యనారాయణగారికి నా కృతజ్ఞత. ఈ పుస్తకం చదివి దానివల్ల ఏ ఒక్కరు లబ్ధిపొందినా నా శ్రమ వృథా కానేరదు ..............................

'రాంనగర్' భీమవరం
మార్గశిర బహుళ సప్తమి.
22—12—59

రచయిత

# విషయసూచిక:







శ్రీ
తాడిమళ్ళ
వెంకటరామారావు

శ్రీమతి
తాడిమళ్ళ
లక్ష్మీనరసమాంబ



# నరసమాంబ

## సీతాపతి ! నీవేగతి !

"అమ్మా ! నాన్నను నేను యింటికి తీసుకొనివస్తానే" అంది నర్సి, తల్లి కనకమ్మ చెక్కిళ్ళమీది కన్నీళ్లు తుడుస్తూ. తండ్రి సీతాపతి నాగేశ్వర నాట్యమండలిలో చేరి నాటకాలలో వేషాలువేస్తూ ప్రస్తుతం రాజమండ్రిలో ఉంటున్న సంగతి రామిరెడ్డి కనకమ్మతో చెప్పింది ఆరోజు ఉదయమే. ఆరు నెలల క్రితం రంగం లేచి పోయిన సీతాపతి ఆచూకీ తిరిగి తెలిసినది ఆరోజుననే. భర్త పునర్దర్శనం ఎప్పుడు కలుగు తుందాఅని కనిపెట్టుకు కూర్చున్న కనకమ్మకు రామిరెడ్డి మాటలు అమృతంలా అనిపించాయి. భర్త ఆచూకీఅంటే తెలిసిందిగాని భర్తను యింటికి రప్పించటం చాలా కష్ట మైనపని.

సీతాపతి భాగ్యవంతుల కడుపున పుట్టినవాడు. తండ్రి కామరాజు ప్రఖ్యాత కలపవ్యాపారి. చేతిలో చిల్లికాని లేకుండ వ్యాపార రంగంలోదిగి స్వయం కృషివల్ల అభివృద్ధి పొంది విశేషలాభాలు గడించి తూర్పుగోదావరిజిల్లా అంతటా పెద్ద పేరు పొందాడు. వ్యాపారానికి కార్యస్థలము కాకినాడ అయినా కామరాజు స్వగ్రామం అర్తమూరు వదలలేదు. అర్తమూరు రాజమండ్రీకి సుమారుపద్నాలుగుమైళ్లదూరంలో

ఉన్న ఒక చిన్న పల్లెటూరు. జనాభా అంతా కలిపి రెండు వేలకు మించి ఉండదు. అందులో అధిక సంఖ్యాకులు రెడ్డి కులస్థులు. పది యిళ్ళల్లో మట్టుకు కొందరు బ్రాహ్మణు లున్నారు. కామరాజు ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. ఇంటిపేరు ఫులుగుర్తవారు. ఆపదియిళ్లు కామరాజు కట్టించినవే. ధనలక్ష్మితోపాటు సంతాన లక్ష్మి కూడ కామరాజు నువరించింది. ఎనమండుగురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు గల కామరాజుకుటుంబం అష్టైశ్వర్యాలతోటి తులతూగుతూ ఉండేది. భార్య కామమ్మకూడ తెలివితేటలుగల మనిషే. లక్ష్మి సరస్వతులు ఒకచోట కలిసి మెలసి ఉండడం కష్టం కాబోలు. కామరాజు మగపిల్లలలో ఎవరికీ విద్యాబుద్ధులు అబ్బలేదు. గారాబంగా పెరిగి అల్లరిచిల్లరిగా తయారయ్యారు.

కామరాజు పురుష సంతానంలో ఏడవవాడు మన సీతాపతి. మంచి స్ఫురద్రూపి; చురుకైనవాడు. సహజంగా తెలివితేటలు గలవాడు. కాని తన తెలివిని విద్యాసముపార్జనకు వినియోగించకుండ వక్రమార్గంలో పెట్టుకోవడంతో మనిషి పెడదారినిపడి బాగుపడలేకపోయాడు. డబ్బు లక్ష్యం లేకుండ విచ్చలవిడిగా ఖర్చుపెట్టడం మొదలుపెట్టాడు. సీతాపతి సుందర విగ్రహం, కుటుంబసంపద, చూచి ఎలాగైనా ఫులుగుర్తవారి సంబంధము కలుపుకుని సీతాపతిని తన అల్లుడుగా పొందాలని కనకమ్మ తండ్రి సుబ్బారాయుడు అష్ట

కష్టాలు పడ్డాడు. ఎల్లాగైతేనేమి చివరకు తాననుకున్నది సాధించాడు. సీతాపతి కనకమ్మల వివాహం జరిగింది. సిరి సంపదలతో తన కూతురు సుఖపడుతుందికదా అని కలలు కన్న సుబ్బారాయుడు నిరాశ పొందాడు. తానొకటి తలచిన దైవమింకొకటి తలచాడు. కనకమ్మ కాపురానికి వెళ్ళినది మొదలు భర్తవల్ల సౌఖ్యమేపొందలేదు. భార్యను సంతానం కనే ఒక పరికరంలా మట్టుకు ఉపయోగించుకొనేవాడు సీతాపతి. భార్యయందు నిజమైన ప్రేమనుగాని, అభిమానాన్నిగాని ఎన్నడు కనపర్చలేదు. సాలీనా ఏ కొద్దిరోజులో తప్ప మిగిలినరోజులలో ఇంటివద్దనైనా ఉండకుండ తిరిగేవాడు.

ఆస్తినికాస్తా గుల్లచేసుకుని చివరకు నాటకం కంపెనీలో తిరగడం మొదలు పెట్టాడు సీతాపతి. సీతాపతిలో సహజంగా హాస్యధోరణి ఉండేది. మాట్లాడుతూంటే తాను నవ్వుతూ ఎదుటివాడిని నవ్విస్తూ ఉండేవాడు. హాస్యరస ప్రధానమైన పాత్రలు ధరించి ప్రేక్షకులను రంజింప చేయడంలో ఆరితేరాడు. జీవితం సుఖలాలసత్వం కోసమే ఉద్దేశింపబడిందనే తత్వధోరణిలో పడ్డాడు. సౌందర్యారాశికి జితేంద్రియత్వం లేకపోతే నైతికపతనం తప్పదు.

సీతాపతియొక్క ఆకర్షణీయమైన విగ్రహంజార్దవాంఛ స్వభావంకల అనేక స్త్రీలను ఆకర్షించింది. సీతాపతి ధనంకంటెకూడసీతాపతి సాంగత్యమే వారలకు అధికసౌఖ్యాన్నిచ్చేది.

సిరిసంపదలకంటెకూడ భర్త అనురాగమే సంసార స్త్రీకి ముఖ్యం. గుణంలేని భర్తతో, అందులోనూ భార్య అంటే అనురాగంలేని భర్తతో కాపురంచేయడం చాలకష్టం. అయినను కాపురముయందలి మక్కువతో, భర్త హృదయం మళ్ళకపోతుందా అనే ఆశతో, హిందూస్త్రీకి భర్తగృహమే నిజమైన నివాసస్థలమనే నమ్మకతో అత్తవారి గ్రామమైన అర్తమూరులోనే ఉంటూఉండేది కనకమ్మ.

కనకమ్మకు ఇద్దరు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు పుట్టారు. పెద్దకూతురు లక్ష్మీనరసమాంబ జననం 1900 సం॥రం డిశెంబరు నెలలో, మార్గశిర బహుళ సప్తమినాడు. మంగళగిరి పానకాల లక్ష్మీనరసింహస్వామిప్రసాదం. ముద్దుగా "నర్సి" అని పిల్చుకుచేవారు. కథాకాలంనాటికి నర్సికి తొమ్మిది సంవత్సరాల వయస్సు. రెండవపిల్ల సీతమ్మకు అయిదు సంవత్సరాలు, కుమారుడు జనార్దనానికి ఏణ్ణర్థం. జనార్దనం ఏడాది పిల్లవాడుగా వున్నపుడు గ్రామం విడచివెళ్ళిన సీతాపతి అజాపజా తిరిగి తెలిసింది ఆరోజు ఉదయమే. ఇన్నాళ్లూ కనకమ్మ కుటుంబయాత్ర అతికష్టంపై జరుపుకుంటూ పిల్లల్ని పోషించుకుంటూ వస్తూంది. భర్తను ఇంటికి తీసుకొనిరాగల నేర్పు, శక్తిసామర్థ్యాలు, వయస్సులో చిన్నదైనా తన పెద్దకూతురుకు కలవని కనకమ్మకు పూర్తిగా తెలుసు. తోటి పిల్లలనుండి వేరుచేయగల ప్రత్యేకత ఒకటి నర్సిలోఉంది. పచ్చని శరీర

చ్ఛాయ, మిసమిట్లు గొలిపే కళ్లూ, అందమైన ముఖముగల నర్సిని చూడగనే ఆమెలో ఏదో విశిష్టత ఉండితీరాలని తోచక మానదు. వయస్సుకు మించిన తెలివితేటలు, చురుకుతనం, ధైర్యం, ఆమెకు ఉండేవి. తరగతిలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలవుతూ ఉపాధ్యాయుల ప్రశంసలకు పాత్రురాలయ్యేది. నర్సి వేసే ప్రశ్నలకు అప్పుడప్పుడు సమాధానం చెప్పలేక ఉపాధ్యాయవర్గం తికమకపడుతూ ఉండేది. ఉన్నతాధికారులు పాఠశాల తణిఖీలకు వచ్చినప్పుడల్లా ఉపాధ్యాయులు, నర్సిద్వారానే తాము బోధించిన విద్యాప్రకర్ష వెల్లడింపచేసుకొనేవారు. తరగతిలోని బహుమతులన్నీ నర్సివే. చిన్నవయస్సులోనే ప్రబంధాలు, పురాణాలలోని భక్తిప్రధానమైన పద్యాలను కంఠస్థము చేసుకుని కోరినపుడల్లా శ్రావ్యంగావినిపిస్తూ ఉండేది. నర్సిఅంటే ఇటు తండ్రి తరఫువారైన పులుగుర్తవారికి, అటు తల్లి తరఫు వారైన రాయసంవారికి చాలాముద్దు. తోటి బాలబాలికలకు నాయకత్వం వహిస్తూ ఆదర్శప్రాయురాలుగా ఉంటూఉండేది. "ఇట్టాంటి కూతుర్ని కన్న సీతయ్య అమ్మాయిని వదిలి దేశాలు ఎట్టాతిరుగుతాడు" అంటూ ఆశ్చర్యంగా అనుకునేవారు, అత్తమూరు పల్లెప్రజలు.

నాన్నను సాధించి తప్పకుండా యింటికి తీసుకురాగల నైపుణ్యం నర్సికికలదని కనకమ్మకు నమ్మికఉన్నా, చిన్నపిల్లకు

కష్టం కలుగచేయవలసి వచ్చినందుకు మాత్రం చాలా దుఃఖం వచ్చింది.

"అమ్మా! నా కడుపున పుట్టబట్టేకదా నీకిన్ని కష్టాలు వచ్చాయి" అని పెద్దగా వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టింది కనకమ్మ.

"అమ్మా! నీవే ఇలా ఏడిస్తే చెల్లాయి తమ్ముడూ బెదరిపోరా" అంటూ తల్లిని ఊరడించింది నర్సి.

"రేపు ఈపాటికి నాన్నను తెచ్చి, నీముందు నిలబెట్టకపోతే నన్ను అడుగు" అని ధీమాగా చెప్పింది. ఆమాటలకు అప్రయత్నంగా చిరునవ్వు కనకమ్మ పెదవులపై తాండవించింది. నర్సి అనుకున్నంతపని తప్పకుండ చెయ్యగలదు.

"ప్రొద్దుటే మొదటి పడవకు రాజమండ్రి వెళ్లొవు గానిలే" అని కూతురుతో చెప్పి గృహకృత్యాలలో నిమగ్నురాలైంది కనకమ్మ.



— 2 —

# నాటకం

ఆరోజుల్లో నాటకం కంపెనీలు ఎక్కువ రోజులు మన్నేవికావు. ఉద్దేశించి నిర్మింపబడిన నాటకశాలలుగాని, రంగస్థలములు గాని లేవు. ఊరు బయట ఖాళీ స్థలాలలో డేరాలు నిర్మించి తాత్కాలికంగా అందులో నాటకాలాడే వారు. వానాకాలంలో నాటకాలాడడం అసంభవం. సాంకేతికంగా కూడ చెప్పుకోదగ్గ విశేషాలేమీ ఉండేవికావు. విద్యుద్దీపాల తళుకులుగాని దూరశ్రవణ శబ్దయంత్రాల విని యోగంగాని ఉండేదికాదు. నాటకం రక్తికట్టడం కేవలం నటకుల నటనా కౌశలం మీద, వాక్పటిమ మీద, కంఠ శ్రావ్యంమీద, దుస్తులమీద ఆధారపడి ఉండేది. నాటక కాలపరిమితి కూడ నిర్ణీతమైన అవధులకు లోనుగాకుండ గంటలుతరబడి విరామంలేకుండాఉండేది. నాటకం పూర్తయ్యే సరికి తెలతెల్లవారవచ్చేది. ప్రేక్షకులకు కూర్చోడానికి తగిన ఆసనాలుగాని, విద్యుత్పంకాలుగాని తదితర సౌకర్యాలుగాని ఏమి ఉండేవికావు. కేవలం నాటకంమీద శ్రద్ధకొద్ది హాజరయ్యి చూచిఆనందించి వెళ్లేవారు ప్రేక్షకులు. చలనచిత్రాల ఒత్తిడి, పోటీలేనందువల్ల నాటకం ఒక్కటే ప్రజలకు వినోదం కలిగించ డానికి ముఖ్యసాధనంగా ఉంటూఉండేది. వరుసగా ఒక్కొక్క గ్రామంలోనే కొన్ని వారాలపాటు రోజువిడిచిరోజు నాటకా లాడుకుంటూ నాటకకంపెనీలు పరిభ్రమిస్తూఉండేవి. ఆర్థికంగా

నాటక కంపెనీలకు ఎక్కువ ఔన్నత్యం ఉండేది కాదు. ఒక్కొక్క గ్రామంలో వరుసగా ఒక డజను నాటకాలు వేసేటప్పటికల్లా ఆకంపెనీ యజమానులు, నటకులు, తదితరపరివారం ఊరంతా సరుకులు వాడుకుని ఋణాలుపడిపోవడం తటస్థించేది. దానివల్ల కంపెనీ పరపతిపోవడం నటకులు ఒక్కొక్కరే జారుకోవడం తుదకు ఆ కంపెనీ విచ్ఛిత్తవ్వడంజరిగేది. కొన్ని సమయాలలో ఒక కంపెనీలో పనిచేసేవారు దానినుండి చీలిపోయి వేరొక కంపెనీ స్థాపించడం, ఆఖరికి ఆ రెండు కంపెనీలు దివాళా తీయడం తటస్థించేవి.

ఒకజతకట్టుబట్టలు, దుప్పటివేసిన చిన్నసంచితో నర్సి రాజమండ్రి చేరుకుంది. ఇంటివద్దనుండి తెచ్చుకున్న ఒకరూపా యిలోను పడవకిచ్చిన కేవు, రెండు అణాలు పోను, ఆమెకు మిగిలిన రొఖ్ఖం పధ్నాల్గు అణాలు. రాజమండ్రి పెద్దపట్టణం కవులు, గాయకులు, పండితులు, పామఋలు అన్నిరకాల వారికి ఆటపట్టు. పవిత్రగోదావరీ తీరంలోఉన్న రాజమహేంద్ర వరం ఆంధ్ర ప్రదేశంలోని ప్రముఖ పట్టణాలలో ఒకటి. నర్సి పుట్టిందికూడ ఆ ఊరిలోనే. అయితేనేం? అదితొమ్మిదేళ్ళనాటి మాట. ఆ గ్రామంలో అప్పట్లో ఉంటూఉన్న ఆమె మాతా మహుడు సుబ్బారాయ్డు చనిపోవడంతో ఆయన సంతానం జీవనోపాధికై ఇతరగ్రామాలు వెళ్ళడం జరిగింది. తొమ్మిదేళ్ల తర్వాత తిరిగి రాజమండ్రిలో ఆరోజునే అడుగు పెట్టింది నర్సి.

నాన్నను తీసుకువద్దామనే ఆవేశంతో ఇంటివద్దనుండి బయలు దేరిందేకాని ఎక్కడకు వెళ్లాలి ? ఏంచెయ్యాలి ? ఎలాకార్యం సాధించాలి ? అనే విషయంలోమట్టుకు ఆమెకు నిశ్చితమైన ప్రణాళికఏమీలేదు. అయినా తెలివైనదిగనుక కాస్త ఆలోచించి నాటకవిషయమైన ఆచూకీఎక్కడదొరుకుతుందాఅనిఅనుకుంది. ఆ రోజుల్లో పెద్దఎత్తున ప్రకటనలుగాని, కరపత్రాల పంపకంగాని,గోడనిండా అచ్చుకాగితాలుఅంటించడంద్వారా ప్రచారంగానిఉండేవికాదు. నడిబజారులో నలుగురుచేరేచోట మట్టుకు కరక్కాయసిరాతో వ్రాసిన పెద్ద ప్రచురణ కాగితం మాత్రం ఏ వీధిలాంతరు స్తంభానికో అట్టకు అంటించివేళ్లాడ గట్టేవారు. నర్సితిన్నగా పెద్దబజారుకువెళ్లి నాల్గుదిక్కులు పరికించి చూచేసరికల్లా లాంతరుస్థంభానికి కట్టిన ప్రకటనకాగితం కనిపించింది. ఊరుకుతూర్పుగా నున్న పెద్దమైదానంలో నిర్మించినడేరాలో ఆరోజు రాత్రి తొమ్మిది గంటలకు " సావిత్రి " నాటకం. వసంతకునిపాత్ర సీతాపతి ధరించడం ఒక ప్రత్యేకత. నర్సి తిన్నగా పెద్దమైదానం వద్దకువెళ్లింది.

సీతాపతి దొరికేస్థానం నాటకశాలే. ఇంకెక్కడ సాధ్యపడదని తీర్మానించుకుంది నర్సి. వచ్చినపని సాధించనిదే తిరిగివెళ్లే అలవాటు ఆమెకులేదు. రాత్రి తొమ్మిది ఎప్పుడవుతుందాఅని నిరీక్షించింది. నిముషం ఒక యుగంలా గడిచింది. రాత్రి కాగానే నాటకానికి టిక్కెట్టు కొనుక్కుని స్త్రీలకు

ప్రత్యేకించబడిన స్థానంలో ముందువరుసలో కూర్చున్నది. జనం క్రిక్కిరిసి ఉన్నారు. ఆడవారికి ప్రత్యేకించబడిన స్థలం బహు స్వల్పప్రదేశమైనా అదంతా నిండిపోయింది. డేరాలో చుట్ట, బీడీ పొగలు క్రమ్ముకున్నాయి. 'టీ, వేడి టీ' అని అమ్ముకునే పిల్లల కేకలుతోను, ప్రేక్షకుల ఈలలుతోను పెద్ద రణగొణధ్వనిలాఉంది. వాద్యగాండ్రు అప్పుడేవచ్చి స్టేజీకెదురుగా త్రవ్విన గోతిలోకూర్చున్నారు. మద్దెలవాయించేవాడు "ధన్, ధన్" మని మ్రోగిస్తున్నాడు. ఫిడేలువాడు "కుయ్,కుయ్" మనిపిస్తున్నాడు. హార్మోనియంవాడు కూడా ఏవో నొక్కులు నొక్కుతున్నాడు. ఇంతలో తెరవెనుక ఒక పళ్లెంలో హారతికర్పూరం వెలిగించారు. నటీనటులంతా వరుసగా నిలబడి దిక్కులు పిక్కటిల్లునట్లుగా "పరాబ్రహ్మ, పరమేశ్వరా" అనే ప్రార్థనగీతాన్ని పాడారు. ప్రేక్షకులలో చాలా మందికి ఆ గీతం కంఠస్తమే. వారుకూడా మోతగా ఆ గీతాన్ని పాడారు.

తెరఎత్తారు. 'సతీసావిత్రి' నాటకం మొదటి దృశ్యం ప్రారంభమైంది, గడిచిందికూడ. మొదటి మూడు దృశ్యాలలోను సీతాపతి పాత్రలేదు. నాల్గవదృశ్యంలో సత్యవంతుడు, స్నేహితుడు వసంతకుడు ప్రవేశిస్తారు. వసంతకపాత్రధారి మన సీతాపతే. వసంతుని మాటలకు స్నేహితుడు సత్యవంతుడేకాదు, యావత్ప్రేక్షకులు విరగబడి నవ్వుకుంటున్నారు.

నర్సి పరకాయించి చూచింది. తన తండ్రే! వేషం ధరించి స్టేజీపై ఉన్నాడు. వెంటనే పట్టలేక,

"నాన్నా,నాన్నా" అనిబిగ్గరగా అరచింది.

"ఏమిటా పిచ్చికేకలమ్మాయి! నోరు మూసుకు నాటకం చూడలేవా? అని చుట్టుప్రక్కలవారు మందలించారు. నర్సి మెల్లిగా జనసమూహాన్ని తప్పించుకుంటూ ముందుకుసాగి అమాంతం స్టేజీఎక్కి వసంతకుని వేషంలో ఉన్న తండ్రిచేయి పట్టుకుంది.

"అమ్మాయి, తప్పు తప్పు క్రిందకు వెళ్ళిపో, బాగుండదు" అన్నాడు సీతాపతి.

"నీవు ఇంటికి వచ్చెయ్యాలి. లేకపోతే నేను కదలను" అంది నర్సి. ప్రేక్షకులు ఈలలు, కేకలు వేస్తున్నారు, కంట్రాక్టరు కళ్ళు ఎఱ్ఱబారిపోయాయి. తాపతి చేసేదిలేక,

"అమ్మాయి నీవా తెరవెనుకకు వెళ్ళికూర్చో. నాటకం పూర్తికాగానే ఇంటికి వెళ్దాములే" అన్నాడు.

తండ్రిమాటలు పిల్లకు సబబుగానే తోచాయి.

"అయితే చప్పున పూర్తిచేసుకు రావే" అని హెచ్చరించి తెరవెనుకకువెళ్ళి కూర్చుంది నర్సి.

ఎట్లాగో నాటకం పూర్తి అయింది. ఎప్పటి కప్పుడు తండ్రివైపు ఒక కన్ను వేసి నిఘాగా చూస్తూనేఉంది నర్సి. నాటకం పూర్తికాగానే సీతాపతి దుస్తులు మార్చుకుని కం

టా్ర్క్టరు చెవిలో ఏదో ఊది నర్సి వెంట బయలుదేరాడు.

బండి శరవేగంతో ఇంటివైపుపోతోంది. తండ్రిని ఎట్లా గైనా ఇంటికి తెస్తున్నానన్న సంతోషం నర్సిముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది. బోనులో చిక్కుకున్న పులిలా బండిలో కూర్చు న్నాడు సీతాపతి, అప్పుడే తీర్పుచెప్పబడి కారాగార శిక్ష విధించబడిన ఖైదీలాఉంది సీతాపతివాటం. ఒకవంక సంసా రం, లోకం, నలుగురు గడ్డిపెట్టి ఇంటికి వెళ్ళమని చెప్పేవారే కాని సంతోషంగా 'దేశాలంటుకు తిరుగు, జల్సాగా బ్రతుకు' అని చెప్పేవారు ఒక్కరూ లేరుగదా ! నర్సిఅంటే సీతాపతికి కొంత ప్రేమతోపాటు భయంకూడాఉంది.

"రేపో, ఎల్లుండో, నేనే ఇంటికి వచ్చేవాడ్నిగా, తొం దరపడి నీవెందుకొచ్చావమ్మాయి" అన్నాడు సీతాపతి.

నర్సి ఏమీ సమాధానం చెప్పలేదు. ఒక చిరునవ్వు నవ్వి ఊరుకుంది. సీతాపతి తనంతటతాను తిరిగి ఇంటికి వచ్చేరకంకాదు. రాత్రింతా నిద్రలేనందువల్ల నర్సి మధ్య మధ్య కునికిపాట్లు పడుతున్నా తండ్రిని గట్టిగా పట్టుకునే కూ ర్చుంది, ఎక్కడ బండిలోంచి దూకి పారిపోతాడో అని. బండి తాపేశ్వరం చేరుకునేటప్పటికి ఉదయం ఎనిమిది గంటలైంది. కాలువవద్ద జనం స్నానం చేస్తున్నారు. గ్రామాలనుండి కూరగాయల కావిళ్లు, పాలకావిళ్లు పట్నంవైపు పోతున్నాయి. తాపేశ్వరం వరకు కంకరరోడ్డు ఉన్నా తాపేశ్వరంనుంచి

అర్థమూరువరకు మాత్రం మట్టిరోడ్డే. ఆ రోడ్డుమీద రెండె డ్లబళ్ళుమాత్రం బహు కష్టంగా వెళ్ళగలవు. గుఱ్ఱపుబండ్లు వెళ్ళటం చాలాకష్టం. జట్కాబండివాడు సీతాపతికూడ బండి దిగి నడవడం మొదలుపెట్టారు.

సీతాపతి బండివాడినుద్దేశించి "ఏమిటోయ్! వెధవ రోడ్లు, బొంబాయి, రంగూన్‌లలో రోడ్లు చూడాలి, నీవు ఆశ్చర్యపోతావు, అట్లా బండిని రోడ్డుమీద నిలబెడితేచాలు గుఱ్ఱం లాగక్కరలేకుండా దానంతటదే నడచిపోతుంది" అన్నాడు.

"అట్లాగా!" అన్నట్లు ముఖం తేలవేసి చూచాడు బండివాడు.

"అమ్మాయి! బండిలో కూర్చోలేక పోతున్నావా? పాపం, కుదుపుగా వున్నట్లుంది కాబోలు" అన్నాడు సర్సి నుద్దేశించి సీతాపతి.

"అవును, నాన్నా, నేనూదిగి నడుస్తాను" అందినర్సి. అమ్మాయిని క్రిందకుదింపి బండివాడికి కిరాయి ఇచ్చి పంపి వేశాడు సీతాపతి. సీతాపతి, కూతురు, ఊరువైపునకు నడచి పోతున్నారు. గ్రామంలో అడుగు పెట్టగానే, ఎదురుపడ్డాడు పూజారి శంకరం.

"అయ్యగారు ఏక్కడినుంచో వస్తున్నారు!" అని పలకరించాడు శంకరం.

"అబ్బే! ఏమీలేదు, ఈమధ్య ఒక వ్యాపార సంద ర్భంలో మెడ్రాసులో కొన్నాళ్లు ఉండవలసి వచ్చిందిలే" అన్నాడు సీతాపతి, తన సహజ ధోరణిలో. నర్సి నవ్వు కుంది తండ్రి ఆడిన అబద్ధానికి.

"బాబూ, పట్నంలో తెల్లోళ్లు గాలి ఓడల మీంద తిరుగుతున్నారుట నిజమేనా?" అన్నాడు శంకరం, పట్నం వార్తలు తెలుసు కుందామనే కుతూహలంతో.

"గాలిఓడలు ఏమిటి? చాలా చాలా విశేషాలు న్నాయి; సావుకాశంగా చెబుతాను" అన్నాడు సీతాపతి ఠీవిగా. ఇల్లు చేరుకోనే లోగానే ఎదురయ్యాడు గొల్ల వెంకన్న.

"అమ్మాయిగోరూ! ఈ యేళ్లైనా పాల బకాయిఇచ్చే యాలండోయ్, అమ్మగోరితో చెప్పి" అన్నాడు వెంకన్న.

"బకాయి డబ్బులు బాబుగారినే అడుగు, ఎదురు గుండా కనిపిస్తున్నారుగా" అంది నర్సి కళ్లెర్రచేస్తూ.

"అదేటండీ; పాలు త్రాగింది మీరున్నూ, డబ్బు ఇచ్చేది బాబుగారున్నా?" అన్నాడు వెంకన్న.

ఇంతలో సీతాపతి కలిపించుకొని "నీకు అసలు ఎంత ఇవ్వాలోయ్? అమాంబాపతు," అన్నాడు.

"నాకు లెక్కలేం తెలుసు? బాబుగోరూ! అదంతా అమ్మగోరికే తెలుసు" అన్నాడు వెంకన్న.

"అయితే ఈ వేళ ఇంకో రెండు శేర్ల పాలు అదనంగా తీసుకురా, రెండు మూడు రోజులలో నీకు ఇవ్వవలసిన డబ్బంతా లెక్కకట్టి గిరగిరాత్రిప్పి నీ ముఖాన్ని పారేస్తాను అణాపైసలతో, ఇంతకీ శేరుపాలు ఎంత ఖరీదు" అన్నాడు సీతాపతి.

"శేరు మూడు అణాలు బాబూ" అన్నాడు వెంకన్న.

"ఓస్; ఇంతేనా ? పట్నంలో శేరు పావలాకు తక్కువలేదు" అన్నాడు సీతాపతి.

"మా బాబుగోరు ధర్మరాజు!" అన్నాడు గొల్లవెంకన్న కృతజ్ఞతా పూర్వకంగా.

ఇంతలో సీతాపతి, నర్సి ఇల్లుచేరుకున్నారు. గుమ్మంలో కనకమ్మ నిలుచుని ఉంది. భర్తను చూడగానే కనకమ్మకు ఎక్కడలేని సంతోషం కలిగింది.

"ఏమే ! కనకం ! ఎంత చిక్కిపోయావ్ !" అంటూ కనకమ్మను పలుకరిస్తూ లోపల ప్రవేశించాడు సీతాపతి. దానికేం సమాధానం చెప్పాలో కనకమ్మకు అర్థంకాలేదు.

"అమ్మా నాన్నను తెచ్చాను, చూచావా"? అంది సగర్వంగా నర్సి. కూతురు చెక్కిళ్లు నిమిరి ముద్దుపెట్టుకుంది తల్లి.

"ఇదిగో ముఖం కడుగుకొనేలోగా కాఫీ ప్రయత్నం పూర్తికావాలి" అని ఆర్డరు ఇచ్చాడు సీతాపతి.

— 3 —

# కనకమ్మ కాపురం

ఒకవారం రోజులు గడిచాయి. క్రొత్తగా అత్తవారింటికి వచ్చిన పెళ్ళికొడుకులా కనకమ్మ చేసినవి, కూతురు అందించినవి తింటూ కూర్చోవడంతప్ప సీతాపతికి ఇంకేమీ పని కనిపించడం లేదు. ఊరునిండా అప్పులు పెరిగిపోతున్నాయి. గంటగంటకు ఎవరో ఒకరువచ్చి తమ బకాయి సొమ్ము వసూలు ఇమ్మని గదమాయించి పోవడమే. డబ్బు విషయమై భర్తను కష్టపెడితే తిరిగి ఎక్కడ పారిపోతాడో నన్న భయంతో కనకమ్మ ఏమీ మాట్లాడకుండా ఆ వచ్చిన అప్పులవాళ్ళకు ఏదో సమాధానం చెప్పి పంపివేస్తూఉండేది.

నర్సి ఎదిగి ఈడువచ్చిన పిల్ల కావస్తున్నది. "అష్ట వర్షాత్, భవేత్ కన్యా" అనే రోజులవి. పెద్దమనిషి కాకుండానే పెండ్లి చెయ్యాలని కనకమ్మ సంకల్పం. ఇంటి గొడవ లేమీ అక్కరలేదు సీతాపతికి. ఒకరోజు ఉదయం "పిల్ల పెళ్ళి విషయం ఏమైనా" ఆలోచిస్తున్నారా? అని భర్తను ప్రశ్నించింది కనకమ్మ.

"ఆలోచనఏమిటి? ఇరవైనాలుగు గంటలు నా మనసులో అదే దిగులు. నమ్ము" అన్నాడు సీతాపతి. "పోనీ అన్నయ్యకు ఏమైనా ఉత్తరం వ్రాయలేక పోయావా?

ఆయన దృష్టిలో ఏద్దైనా మంచి సంబంధం ఉంటుంది” అని తిరిగి అన్నాడు సీతాపతి.

“బాగానే ఉంది. కందకు లేని దురద బచ్చలికి ఉంటుందా? మీకు లేని తొందర మా అన్నయ్యకు ఎక్క ణ్ణుంచి వస్తుంది?” అంది కనకమ్మ.

“ఉండవే పెళ్ళి అంటే మాటలా? కొన్ని వేల రూపా యలు కావాలి. డబ్బు ఎట్లా కూడబెట్టుకోవాలా అనే ఆలో చనతో నా బుర్ర వేడెక్కి పోతోంది” అన్నాడు సీతాపతి, బుర్రలో ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్న వాడిలా ముఖంపెట్టి. ఒక పావుగంటసేపు బుర్ర ఎత్తకుండా ఏదో పథకము వేస్తు న్నవాడిలా కూర్చుండి పోయాడు సీతాపతి. చివరకు మెల్లగా ఇల్లా అన్నాడు. “బొంబాయిలో నన్నెరుగున్న బట్టలవర్తకులు అనేకులున్నారు. ఒక వెయ్యి రూపాయలు ఎల్లాగో చేతికి చిక్కించుకొని చిన్న వ్యాపారం ప్రారంభిస్తే ఒకటి, రెండు నెలల్లో దానిని పదిరెట్లుగా పెంచేటట్లు వారు నాకు తప్పక తోడ్పడతారు. నేను నీ మాట వినకుండా డబ్బంతా వృథా గాతగలేశాను. నీవు చెప్పినట్లు నేను వినిఉంటే ఈపాటికి లక్షలకు లక్షలు నిలవేసి ఉండేవాడిని కదా!” అంటూ పెద్ద నిట్టూర్పు విడిచాడు సీతాపతి. సీతాపతి చెపుతున్నవి హృ దయ పూర్వకమైన మాటలులాగే కనకమ్మకు తట్టాయి.

"పోనీ నా చేతి గాజులు, మెడలోని కంటె అమ్మి సొమ్ము పూడ్చుకొని వ్యాపారం చేస్తారా?" అంది కనకమ్మ.

"ఛ! ఛ! ఇంకా నీ వస్తువులు వాడుకోనా? మహా పాపం. నేను నిన్ను లోగడ పెట్టిన బాధలుచాలు" అన్నాడు సీతాపతి.

"అదేమిటండీ! అమ్మాయి పెళ్ళికి డబ్బు పూడ్చుకోవడం కంటేనా? వస్తువులా మనల్ని కాపాడేవి?" అంది కనకమ్మ.

"అయితే అట్లా చెయ్యమంటావా" అని రెట్టించాడు సీతాపతి. "తప్పకుండా" అంటూ కనకమ్మ చేతి గాజులు మెడలోని కంటె తీసి భర్తకు ఇచ్చింది.

"పాపం మొత్తంమీద నీ నగలన్ని నేనే కాజేశాను" అని క్షమార్పణ చెప్పుకుంటూ అందుకున్నాడు ఆ వస్తువుల్ని సీతాపతి. తన భర్తలో కలిగిన మార్పునకు కనకమ్మ అపరిమితానందం పొందింది. ఇన్నాళ్ళకు తన భర్త మనస్సు మారిందికదా అనుకుంది. తన రోజులు మారినందుకు భగవంతునికి నమస్కరించుకొంది. ఉన్న వస్తువులు కూడ పోయాయనే విచారం ఆమెకు ఏ కోశాన్నీ లేదు. వస్తువులు పోతేపోయాయిగాని, తన భర్త వ్యాపారంచేసి ఏదో చాలా సంపాదిస్తాడనీ, ఆ లాభాలతో తన కూతురు నర్సికి పెద్ద సంబంధంచూసి పెళ్ళి చెయ్యవచ్చుననీ కనకమ్మ ఆశించింది.

"చూడు! నేను ఈ మధ్యాహ్నమే ప్రయాణమై వెళ్ళి, ఒక వారం రోజులలో వ్యాపారం సిద్ధం చేసికొని వచ్చేస్తాను" అన్నాడు సీతాపతి.

సీతాపతి ప్రయాణానికి ముహూర్తం నిశ్చయించ బడింది. "బొంబాయి చేరుకోగానే వెంటనే ఉత్తరం వ్రాయండి సుమా" అందికనకమ్మ.

"సరే! బాగానేవుంది. అట్లా చేరుకోగానే ఇట్లా ఉత్తరంముక్క గీకి పారేయ్యనూ" అన్నాడు సీతాపతి, చేతులు ఊపుతూ. సీతాపతి ఇంటివద్దనుండి బయలుదేరాడు. కనకమ్మ గుమ్మంలో నిలబడి సీతాపతి సందు మళ్ళేవరకు చూచింది.

"నాన్న తప్పకుండా వారంరోజులలో తిరిగివస్తాడా?" అంది నర్సి.

"తప్పకుండా వస్తారమ్మా". అంది తల్లి కనకమ్మ.

"ఏమోనమ్మా. నాకు భయంగా ఉంది" అందినర్సి.

"భయమెందుకే? వెర్రితల్లీ, వారం రోజుల్లో నాన్న రావడం, ఆ తర్వాత రెండు మూడు నెలల్లో నీకు పెళ్లి చెయ్యడం జరుగుతుంది. అత్తవారింటికి వెళ్ళాక వారానికి ఒకఉత్తరం వ్రాస్తుండాలి సుమా!" అంది కనకమ్మ నవ్వుతూ నర్సిసిగ్గుతో తల వంచు కుంది.

సీతాపతి ఊరువిడిచి 'వ్యాపార దృష్టి'తో వెళ్లివారం

దాటింది. పదిహేను రోజులు గడిచాయి. నెల పూర్తయింది ఏసమాచారంలేదు. సీతాపతి వ్యాపారం, అంటె ఏమిటో నర్సికి, కనకమ్మకు బోధ పడిపోయింది. సీతాపతికి పరివర్తనం కలిగిందని నమ్మిమోసపోయినందుకు చింతించారు. తమ దురదృష్టాన్ని తామే నిందించు కున్నారు. ఊరునిండా అప్పులు పెరిగిపోయాయి. చేతిలో చిల్లిగవ్వకూడలేదు. ఒక రోజున కనకమ్మకు ఉత్తరం వచ్చింది. ఆతృతతో కవరువిప్పి చూచింది.

"కనకమ్మకు !

నేను ఇంతవరకు నీకు ఉత్తరం వ్రాయలేక పోయాను. అందుకు నాకూ బాధగానేఉంది. మానాటకం కంపెనీ తిరిగి ఈరోజుననే రంగం చేరుకుంది. ఇక్కడఎన్నాళ్లుఉంటామో మాకే తెలియదు. మీరంతా భీమవరంవెళ్లి మీ అన్నయ్యగారింట్లో ఉంటే బాగుంటుంది. ఆయనగారే అమ్మాయి పెళ్ళి ప్రయత్నం కూడ చేయగలడు.

ఇట్లు,

సీ తా ప తి.

అనిఉంది ఆ ఉత్తరంలో. బరువెక్కిన హృదయంతో ఉత్తరం చదవడం ముగించింది కనకమ్మ. కళ్ళవెంట నీళ్లుగిర్రున తిరిగాయి. "అమ్మా ఎక్కణ్ణుంచే ఉత్తరం" అంటూవచ్చింది నర్సి. ఏమీ చెప్పలేక నర్సి చేతిలో పెట్టిందా ఉత్తరాన్ని

కనకమ్మ. "పూర్వజన్మసుకృతం అమ్మాయి" అంది కనకమ్మ వేదాంత ధోరణిలో. పరిస్థితి అంతా వివరిస్తూ సోదరుడు వెంకట్రామయ్యకు ఉత్తరం వ్రాసింది కనకమ్మ. వెంటనే ఆయనవద్దనుండి నూటయాభైరూపాయలు అందాయి కనకమ్మకు. బాకీలు తీర్చుకుని, వెంటనే భీమవరం వచ్చేయమని జాబువ్రాశాడు. అట్లాగే చేసింది కనకమ్మ.



— 4 —

# మేనమామ – వెంకట్రామయ్య

భీమవరంలో వెంకట్రామయ్య పేరెన్నికగన్న న్యాయ వాది. సుబ్బారాయుడుగారి రెండవ కుమారుడు. వెంకట్రామయ్య జ్యేష్ఠసోదరుడు వెంకటశివుడు నెల్లూరు కళాశాల అధ్యక్షుడుగా ఉంటూ ఉన్నాడు. కనిష్ఠ సోదరుడు కృష్ణ మూర్తి నర్సాపురంలో న్యాయవాది. సోదరులు ముగ్గురికి కనకమ్మ అంటే ఎంతో ప్రేమ. ఆమెకు కాపురంలో కలిగిన కష్టాలను గూర్చి ఎంతైనా చింతించారు. వెంకటశివుడు రచయిత, సంఘసంస్కర్త. వెంకటశివుడు, వెంకట్రామయ్య సోదరి కనకమ్మకు ఆర్థిక సహాయం చేశారు. పిల్లల చదువు సంధ్యలకు వారే కారకులు.

వెంకట్రామయ్య సరైన సలహాలు చెప్పటలో అనుభవశాలి అని తాలూకా న్యాయవాదులలో పేరెన్నికగన్నాడు. అప్పట్లో న్యాయవాదులు విరివిగా ఉండేవారు కారు, గ్రామానికి ఏ కొద్దిమందో ఉండేవారు. న్యాయవాదులు మంచి ప్రపంచజ్ఞానం కలిగి రాజకీయ రంగంలో ముందడుగువేస్తూ ఉండేవారు. సాంఘిక, రాజకీయ చైతన్యం వారిమూలాన్నే కలిగేది. ప్రముఖ రాజకీయోద్యమాలకు నాయకత్వం వారిదే. వెంకట్రామయ్య భీమవరం విద్యారంగంలోకూడ చాలా కృషిచేశాడు.

జమిందారీలు రద్దుకాలేదు. కోర్టులో దావాలు ఎక్కువగానే ఉండేవి. స్తోమతుగల పార్టీలు ఉండేవారు. కనుక న్యాయవాదుల సంపాదన అధికంగానే ఉండేది. వెంకట్రామయ్య న్యాయవాద వృత్తిలో విశేషంగా ధనం ఆర్జించాడు. బంధుప్రేమ ఆయనకు ఉండుకొన్న పేరెన్నికగల గుణాలలో ఒకటి. అతిథి సత్కారాలలో వెంకట్రామయ్య వెనుకంజ వేసేవాడు కాదు. తాను చెప్పదలుచుకున్నది మెల్లగా, సౌమ్యంగా హృదయానికి హత్తుకునేటట్లు చెప్పేవాడు. ఆయన వాదనాశక్తిలో ఆయన పార్టీలకు ధృఢ సమ్మకం ఉండేది. ఆయన భార్య రత్నమ్మకూడ యోగ్యురాలు. భర్త ఉద్దేశానికి భిన్నంగా ప్రవర్తించేదికాదు. ఆడపడుచు కనకమ్మ మనసుకు కష్టం కలుగకుండా చూసేది. కనకమ్మ వెంకట్రామయ్య ఇంటివద్దనే ఉండిపోవల వచ్చింది. వెంకట్రామయ్య ఇంట్లోఉన్న కాలంలో గృహ విషయమైన పనులు ఆట్టే లేకపోవడంతో కనకమ్మకు కొంత విశ్రాంతి చిక్కింది. కనకమ్మకు గ్రంథపఠనం అంటే చాలా ఇష్టం. విశ్రాంతి సమయాలలో అనేక గ్రంథాలు చదివేది. జాతీయ సారస్వతంకూడ విరివిగా చదివింది.

బ్రిటిషువారి పరిపాలన సాగుతున్న రోజులవి. బ్రిటిష్ దాస్య శృంఖలాలను విచ్ఛేదం చేసుకోవాలని ప్రజావాంఛ ప్రబలుతున్న రోజులవి. తిలక్ మహాశయుని శంఖారావం

ప్రోగడం ప్రారంభిస్తోంది. స్వాతంత్ర్య సముపార్జనకు ప్రజా నీకం ఉవ్విళ్లూరడం మొదలు పెడుతోంది. న్యాయవాదులు, ఉద్యోగులు తమ తమ వృత్తులకు స్వస్తిచెప్పి స్వాతంత్ర్య సమరంలో దుమకడానికి సిద్ధపడుతున్నారు.

తీరిక సమయాలలో కనకమ్మ నూలువడకడం ప్రారంభించింది. తాను వడికిన నూలుతో నేసిన బట్టలనే కట్టుకుంటానని ప్రమాణం చేసుకొంది. కరడు కట్టుకొని పోయిన సాంఘిక దురాచారాలను ఖండించింది. చిన్న చిన్న సభలలో చక్కని ఉపన్యాసాలు ఇవ్వడం మొదలు పెట్టింది. ఈ విధంగా చెల్లెలు ముందంజ వేస్తున్నందుకు వెంకట్రామయ్య సంతోషించాడు. తనకు కలిగిన సాంఘిక చైతన్యం ద్వారాను, చదువుకున్న పురాణ వాఙ్మయం ద్వారాను, తన వివాహిత జీవితంలో కలిగిన దుఃఖాన్ని కొంత దిగమ్రింగుకొని జీవయాత్ర గడపడం మొదలు పెట్టింది కనకమ్మ. తత్వ, వేదాంత జ్ఞానం సరైన పంథాలో బోధపరుచుకుంది. తాను సంపాదించిన జ్ఞానాన్ని కుమార్తె నర్సికికూడ బోధిస్తూ ఉండేది. కుమార్తె విద్యాబుద్ధుల విషయములో కనకమ్మ ప్రత్యేక శ్రద్ధ కనపరచేది. కుమార్తెకు సంగీతంకూడ నేర్పించింది.



# వి వా హం

నర్సి వివాహం చెయ్యడానికి విశ్వప్రయత్నాలు చేస్తు న్నాడు వెంకట్రామయ్య. తనవద్దకు వచ్చే పార్టీలను పెళ్ళి సంబంధాలను గూర్చి వాకబుచేస్తూ ఉండేవాడు. వెంకట్రా మయ్య వద్దకు తరచు వచ్చేవారిలో కలిగొట్ల రామయ్య ఒకడు. రామయ్యది యండగండి గ్రామం. ఎండగండి భీమవ రానికి ఏడుమైళ్ళ దూరంలో ఉన్న ఒక పల్లె. రామయ్యకు చెప్పుకోతగ్గంత ఆస్తి పాస్తులు లేవు. కాని నిత్యావసరాలకు మట్టుకు లోటు లేదు. ఉన్నదేదో జాగ్రత్తగా వాడుకొనే వాడు. ఒకసారి వస్తువులన్నీ జాగ్రత్త చేసి పదిలంగా వాడు కొనేవాడు. ఆయుర్వేదవైద్యం చేసుకుంటూ డబ్బు సంపా దించేవాడు. అంతేకాకుండా దస్తావేజులు వగైరా వ్రాత కోతలుకూడా జరిగిస్తూ కొంత ధనం సేకరించు కొనేవాడు. లోతుకుపోయిన కళ్లు, విశాల ఫాలభాగం, తలపై అర్ధచంద్రా కారంలో ఉండే కొద్ది జుట్టూ కలసి సన్నగా పొడుగ్గా ఉండే రామయ్యను చూడగానే చాలా పట్టుదలగల మనిషిఅని స్ఫురిస్తుంది. రామయ్యకు చిన్న వయస్సులోనే భార్య పోయింది. సోదరి వెంకటనర్సమ్మ అంటే రామయ్యకు చాలా ప్రేమ. వెంకటనర్సమ్మను రావిమట్ల గ్రామ కాపురస్థుడు తాడిమళ్ళ విశ్వనాథంకు ఇచ్చి వివాహం చేశారు. ఆమెకు

ఇద్దరు పుత్ర సంతానం కలిగారు. పెద్దవాని పేరు వెంకట రామారావు, జననం 6-9-1896, దుర్ముఖి నామ సంవత్సర శ్రావణ బహుళ చతుర్దశినాడు, రెండవ కుమారుడు శేషగిరి కొద్దికాలం పెరిగి అవివాహితుడుగ చనిపోయాడు.

విశ్వనాథం కూడా సాంప్రదాయ కుటుంబంనుండి వచ్చినవాడే. శ్రీవత్సగోత్రం. విశ్వనాథం తండ్రి రామన్న, కాశీలో చనిపోతే ముక్తి కలుగుతుందని అక్కడే నివాసం ఏర్పరచుకొని ఉండిపోయాడు. ప్రయాణ సౌకర్యాలులేని ఆ రోజులలో కాలినడకను కాశీ చేరుకున్న వాళ్ళలో ఆయ నొకడు. విశ్వనాథంకు వ్యవసాయమన్నా, మొక్కల పెంపక మన్నా ఎక్కువ ఇష్టం. బాణాసంచా కట్టడంలో నేర్పరి. ఇంట్లోవాళ్ళకు ఉంది లేదూ అని ఆలోచించకుండా సర్వస్వం చుట్టుప్రక్కల వాళ్ళకు పెట్టేసేవాడు. ఇంటిగొడవలు అంతగా పట్టించుకొనేవాడు కాదు. కుమార్ల చదువు విషయంలో ఏమీ శ్రద్ధ చూపించలేదు. ఏది ఎల్లా పోయినా లెక్క చేసే వాడుకాదు. కుటుంబ విషయాలపై విశ్వనాథంకు ఆసక్తి లేకపోవడంతో సోదరి వెంకటనర్సమ్మ మంచి చెడ్డలు రామయ్య స్వయంగా చూడడం మొదలు పెట్టాడు. ఆమె కుటుంబ భారం తనమీద వేసుకున్నాడు. వెంకటరామా రావుకు శ్రమపడి చదువు చెప్పించాడు.

గ్రామంలో వుండే వ్యవహారాలు రామయ్య కృతంగా పరిష్కారమయ్యేవి. వారికి కోర్టు విషయమైన విషయాలుంటే రామయ్య చూచిపెట్టేవాడు. పార్టీలను న్యాయవాది వెంకట్రామయ్య వద్దకు తీసుకొని వెళ్ళేవాడు. ఆ సందర్భంగా రామయ్యకు, వెంకట్రామయ్యకు స్నేహం కలిసింది.

"ఏమైనా మంచి సంబంధాలుంటే చెప్పండి, మా మేనకోడలికి పెళ్ళిచెయ్యాలి" అన్నాడు వెంకట్రామయ్య; రామయ్యతో ఒకరోజు మాటలు ధోరణిలో.

"మా మేనల్లుడున్నాడు కావలస్తే చూచుకోవచ్చు" అని వెంటనే సూచించాడు రామయ్య.

ఆరోజుల్లో వధువు, వరుడు ఒకరి నొకరు పెళ్ళికి ముందు చూచుకోవడం కంటె, ఇంటి పెద్దలే చూచుకు రావడం ఆచారంగా వుండేది. వెంకట్రామయ్య రామా రావును చూచుకువచ్చాడు. రామారావు అప్పట్లో స్కూలు ఫైనలు చదువుచున్నాడు. స్కూలు ఫైనలు పూర్తి కాగానే ఏదో ఒక వుద్యోగం తప్పకుండా వస్తుంది. ఆస్తిపాస్తులు లేక పోయినా తను, కాబోయే భార్య, కాలం గడపడానికి మట్టుకు లోటులేకుండా జీతండబ్బులు వస్తాయి. పెద్దపెద్ద కట్నాలిచ్చి అందని పండ్లకు ఆశించేకంటే ఎరిగివున్న కుర్రవాడి కిచ్చి నర్సిని పెండ్లిచేయడం బాగుంటుందని అనుకున్నాడు వెంకట్రామయ్య.

"అబ్బాయి కొంచెం నల్లగా పొట్టిగా వుంటాడు. మిగిలిన విషయాలన్నీ బాగానే వున్నాయి. "సంబంధం స్థిరపరచనా?" అన్నాడు వెంకట్రామయ్య కనకమ్మతో.

"నల్లని అబ్బాయి నీకు నచ్చకపోతేచెప్పు, అమ్మాయి" అంది కనకమ్మ కుమార్తె నర్సితో. బహుశః కురవ్రాడు నల్లనివాడు కాబట్టి కూతురుకు నచ్చదేమో అనుకుంది కనకమ్మ.

"నాకు కాబోయే భర్త నల్లగానే వుంటాడే, కలలో దేవుడు చెప్పాడు" అంది నర్సి, తల వంచుకొని. కుమార్తెకు సంబంధం నచ్చిందికదా అనుకొంది కనకమ్మ. తల్లీకూతుళ్ల సంభాషణ వింటూనే ఉన్నాడు వెంకట్రామయ్య.

"సంబంధం నచ్చినట్లేనా? ఏమాత్రం సందేహమున్నా చెప్పండి. ఇంకొకటి చూస్తాను" అని రెట్టించాడు వెంకట్రామయ్య. కనకమ్మ, కూతుళ్ళ నిశ్చయం ధృవపరచుకుందామనే ఉద్దేశ్యంతో.

"మాకు అన్నీ నచ్చాయి. సంబంధం స్థిరపరచు, అన్నయ్య" అంది కనకమ్మ. "సరే" అన్నాడు వెంకట్రామయ్య.

రామయ్య సోదరి వెంకటనర్సమ్మ అప్పటికే కాలం చేసింది. తన తల్లి పాపమ్మ వృద్ధురాలైంది. రామారావు వివాహంచూచి ఆనందిస్తుందికదా అనుకున్నాడు రామయ్య. మేనల్లుడి భార్య వచ్చి ఇంటి పనులు దిద్దుకుంటుంది కదా

అని అభిప్రాయ పడ్డాడుకూడా. రామారావునకు సంబంధం నచ్చిన విషయం నిర్ధారణ చేసికొన్నాడు రామయ్య. రామయ్య, వెంకట్రామయ్యలు కలిసి మిగిలిన విషయాలన్నీ మాట్లాడుకొన్నారు. సుముహూర్తం నిశ్చయించ బడింది. ప్రమాది నామ సంవత్సర మార్గశిర బహుళ త్రయోదశి నాడు (25-12-1913 సం॥రం తేదీని) భీమవరానికి సమీపంగా ఉన్న పెన్నాడ గ్రామంలో రామారావుకు, నర్సికి వివాహం జరిగింది. కూతురు పెళ్ళినాటికి అల్లుడు కాళ్లు కడగటానికి ఎల్లాగో రప్పించారు సీతాపతిని. ఆర్థిక సంబంధమైన సమస్య లేవీ తనమీద పడలేదు కాబట్టి సీతాపతి ఎట్లాగో వచ్చి కూతురు పెళ్ళి అయిందనిపించాడు. నర్సి నరసమ్మ అయింది.



# అమ్మలక్కలు

నరసమ్మ పెళ్ళయిన కొద్ది కాలానికి కాపురానికి వెళ్ళింది. వెంకటరామారావు స్కూలు ఫైనలు పరీక్ష పూర్తిచేశాడు. రామయ్య జరిపిన కృషి మూలంగా రామారావునకు రెవిన్యూ శాఖలో ఉద్యోగం లభించింది. తన కుటుంబం తను పోషించుకొనగల శక్తి కలిగింది. అమ్మాయి అడుగు పెట్టినవేళ మంచిదనుకున్నాడు రామయ్య. రామయ్య చేసిన సహాయానికి రామారావు, వెంకటాద్రియ్య చేసిన సహాయానికి నరసమ్మ కృతజ్ఞత తెలుపుకున్నారు. రామయ్యను "బాబుగారూ!" అని పిలుచుకునేది నరసమ్మ.

బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన విద్యా విధానం, విద్యా సముపార్జన, చేసినవారిని గుమాస్తాలుగ తయారు చేయడానికి ఉపకరించింది. ఆంగ్లేయ విద్య నభ్యసించిన వారికి ప్రభుత్వ నౌకరీకంటె పరమావధి ఉండేదికాదు. ఉద్యోగంలోచేరి పై పదవుల ఆశించడం ఒక్కటే లక్ష్యంగాఉండేది. ప్రభుత్వోద్యోగులంటే ప్రజానీకానికి ఇప్పటికంటె ఎక్కువ భయం, గౌరవ ప్రతిపత్తులు ఉండేవి. క్రింది వుద్యోగులకు పై ఉద్యోగి అన్నా ఎక్కువ భయంగానే ఉండేది. బ్రిటిష్ పరిపాలనా వ్యవస్థలో వారు సృష్టించిన ఉద్యోగుల అంతస్థులు గొప్పగా పనిచేసేవి.

రామారావు తన ఉద్యోగ ధర్మ నిర్వహణలో 'దిట్ట' అనిపించుకున్నాడు. ప్రతి చిన్న విషయానికి పై ఉద్యోగులు రామారావును సంప్రదిస్తూ ఉండేవారు. అందుచేత తోటి ఉద్యోగులకు రామారావు అంటే అసూయగా ఉండేది. కాని ఉద్యోగ నిర్వహణలో ఎట్టి లోటుపాట్లు లేనందువల్ల రామారావును ఎవరూ ఏమీ చేయలేక పోయేవారు.

నరసమ్మ గృహకృత్యాలలో జాగ్రత్తగా వ్యవహరిస్తూఉండేది. రామారావు తనకు వచ్చే స్వల్పజీతం నరసమ్మ చేతిలోనే పెడుతూ ఉండేవాడు. ఆమె సొమ్మును జాగ్రత్తగా ఇంటి ఖర్చులకు వాడుతూ వచ్చేది. ఉద్యోగరీత్యా తాడేపల్లి గూడెంలో కాపురంచేస్తున్న రోజులవి. రామారావు రెవిన్యూ ఇన్స్పెక్టర్‌గా ఉండేవాడు. వృత్తిరీత్యా నెలలో చాలా రోజులు ఇతర వూళ్ళలోనే క్యాంపుచేస్తూ వుండాల్సి వచ్చేది. క్రొత్తగా కాపురానికి వచ్చిన చిన్న పిల్ల అయినా ఇంట్లో నిర్భయంగానే కాలం గడుపుకొని పోయేది నరసమ్మ. ఇంటి ఆవిడ వీరమ్మగారు ఉత్తమురాలు. చిన్నపిల్ల ఎక్కడ శ్రమపడి పోతుందో అని మాటమాటికి మంచి చెడ్డలు అడుగుతూఉండేది. "నే సాయం పడుకోనా అమ్మాయి; పోనీ ఈ పూట మా ఇంట్లో భోజనం చేయకూడదా?" అంటూ తరచు పలకరిస్తూ ఉండేది. నరసమ్మకు ఇతరులను కష్ట పెట్టడం ఇష్టంలేదు. "ఫరవాలేదు పిన్నిగారు, అంతగా

భయంవేస్తే మిమ్మల్ని పిలుస్తాలెండి; ఒక్కతినే కదా నా కెంత వంట" అని సమాధానాలు చెప్పుతూ ఆ పెద్దమనిషికి ఏమీ కష్టం కలిగించేదికాదు.

నరసమ్మ ఎక్కువ అద్దెఇచ్చి పెద్దపెద్ద వాటాలు అద్దెకు తీసుకొనేదికాదు. ఆమె కాపురం ఉంటున్న వాటాగాక, ఇంకా ఆ ఇంట్లో మూడు వాటాలవారు కాపురం ఉంటూ వుండేవారు. అది చాలా పెద్దలోగిలి అవడంవల్ల అన్ని వాటాలవారికి సౌఖ్యంగానే ఉండేది. నరసమ్మ తీరిక సమయాలలో ఏదో ఒక గ్రంథపఠనం చేస్తూఉండేది. ముఖ్యంగా రామాయణం, భారతం, భాగవతం చదువుకుంటూ ఉండేది. ఆమెకు పురాణాలంటే చాలా ఇష్టం. జ్ఞాన సముపార్జనకే తన తీరిక సమయాలను పూర్తిగా వినియోగించుకొనేది. తీరిక సమయాల్లో అమ్మలక్కలు నలుగురూచేరి ఆడిపోసుకునే మాటలు ఆమెకు గిట్టేవికావు. అసలు ఇంకొకరి విషయంలో జోక్యంకలుగ చేసుకోవడం అంటేఆమెకు అసహ్యం. నరసమ్మ ఉనికి పక్కవాటాల వారికి చాలా ఆశ్చర్యకరంగా ఉండేది. ఆమెను ఆమెవాటా దాటి ఇవతలకు రావడం ఏ రెండు మూడు రోజులకో ఒకసారి చూసేవారు. ఆమె నాలుగు గోడలమధ్య అంత చిన్నవయస్సులో నలుగురితోను కలవకుండా తన మట్టుకుతాను ఏదో చదువుకోవడం వారికి చాలా ఆశ్చర్యం కలుగజేసేది.

"అబ్బే మా ఇంట్లో నెయ్యి మాత్రమే వాడుకుంటాం" అంది సూరమ్మ టపీలుమని.

"అయితే బంగాళాదుంప దుంప జాతిలోనిది కాదా?" అంది వెంకాయమ్మ వెటకారంగా, సూరమ్మను బోల్తా కొట్టించానన్న ధీమాతో.

"బంగాళాదుంప దుంప జాతిలోదే అయినా, కంద, పెండలంలాగ తద్దినాలకు పనికివచ్చే తక్కువజాతి దుంప కాదులే" అంది సూరమ్మ, వెంకాయమ్మను ఎత్తిపొడుస్తూ.

"లింగు లింగుమని ఒకరో ఇద్దరో ఇంట్లో ఉంటే నేనూ సీమనుండి కూరలు తెప్పించి వండేదాన్నే" అంది వెంకాయమ్మ మూతి ముడుచుకుంటూ.

"ఇంట్లో పందిపాపాయిలల్లా, పిల్లలుంటే నేజనాల్లో లెక్క ఏమిటి ? మా ఇంట్లో స్వజనం లేకపోయినా, వచ్చి పోయివారికేం లోపం లేదులే!" అంది సూరమ్మ అపజయాన్ని అంగీకరించని దానిలా.

"పిల్లవాడు ఏడుస్తున్నాడమ్మా" అంటూ అక్కణ్ణుంచి వెళ్లిపోయింది వెంకాయమ్మ, ఏదో విధంగా సూరమ్మ సూటీ పోటీ మాటలనుండి తప్పించుకుందామనే ఉద్దేశ్యంతో.

"చూచావుటమ్మా, ఈ గుమస్తా పెళ్ళానికి ఎంత అభిమానమో! మింగ మెతుకులేదు, మీసాలకు సంపెంగ నూనె అన్నట్లు" అంది సూరమ్మ, వెంకాయమ్మ వెళ్లిన వెంటనే.

"వెంకాయమ్మ చుప్పనాతి పీనుగ, పోనీలెద్దూ!" అంది మంగమ్మ, సూరమ్మ సానుభూతి సొంతం సంపాదించు కుందామనే అభిలాషతో.

"మరే! దీనిబండారం ఎవరికి తెలియదు? ఈమొగారి వెధవ ఆడబడుచు లేచిపోయిందన్న సంగతి లోకం ఎరుగ దనుకుంటోంది కాబోలు, పాపం! పిల్లి కళ్ళు మూసుకొని పాలు తాగినట్లు" అంది సూరమ్మ. ఆ మాటలకు అక్కడు న్నవారంతా విరగబడి నవ్వుకున్నారు. కాస్త నవ్వులు చల్లా రగానే "అది సరేగాని వీరమ్మ పిన్నిగారూ! ఈ మధ్య క్రొత్తగా కాపురానికి వచ్చింది ఎవరమ్మా? పైకి మనిషైనా కనిపించదు." అని అడిగింది వీరమ్మను మంగమ్మ.

"ఆవిడగారి పేరు నరసమ్మ" అంది వీరమ్మ.

"ఆవిడ ఎప్పుడూ ఇక్కడకు రాదేం?" అంది మంగమ్మ.

"ఏమిటో ఆవిడగారిది అదో ధోరణి. ఎప్పుడూ ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చుంటుంది" అంది వీరమ్మ. ఆ రోజు సమావేశం అక్కడితో ముగిసింది.

మర్నాడు! యథాప్రకారం సకాలానికి నల్గురూ చేరుకున్నారు. వెంకాయమ్మ అతి ఆవేశంతో ప్రవేసించింది రంగస్థలంలోకి. "ఏమండీ! వీరమ్మ పిన్నిగారూ! నిన్నటి రోజున నన్నుగురించి ఏవేవో కూసిందిటగా? ఈ సూరమ్మ పతివ్రతా తిలకంలాగ" అంది వీరావేశంతో వెంకాయమ్మ.

దానితో వెంకాయమ్మ, సూరమ్మ ఒకరి నొకరు నానా మాటలు అనుకున్నారు. అందరూ గొల్లుమన్నారు. ఆ గొడవకు ఇవతలకు వచ్చింది నరసమ్మ. ఎవరి గాథను వారు ఏకరువు పెట్టారు నరసమ్మతో తగువు తీర్చమన్నట్లు. ఆమెకు ఒక విధమైన న్యాయ నిర్ణయాధికారి హోదా అంటగట్టారు. నరసమ్మ చిరునవ్వు నవ్వి, "ఎందుకమ్మా? గౌరవంగా బ్రతకవలసిన మనం వీధిని పడడం? ఎందుకొచ్చిన దెబ్బలాటలివి? చక్కగా ఏ పుస్తకమో చదువుకొని కాలక్షేపం చేసికోక" అంది. ఆ మాటలు అక్కడ ఉన్న వారందరికి నచ్చాయి. "అయితే ఆ కాలక్షేపం ఏదో మీరే జరపండి" అన్నారు అందరూ ఏక కంఠంతో. ఆ రోజునుండి ప్రతిరోజు మధ్యాహ్నం ఏ భాగవతమో చదివి వినిపిస్తూ ఉండేది నరసమ్మ. దానితో వారందరికి చక్కని కాలక్షేపం ఏర్పడింది.

సాధారణంగా నలుగురు ఆడవాళ్ళు ఒకచోట చేరితే కట్టుకున్న బట్టలను గురించో, ధరించే వస్తువులను గురించో, మాట్లాడుకుంటూ ఉంటారు. "ఈ చీర ఎంతమ్మా? ఎక్కడ కొన్నారు?" అని ఒకఆమె అడిగితే, "అబ్బే! కొనలేదమ్మా మొన్న సంక్రాంతి పండగకు మా అన్నయ్య పెట్టాడు" అని ఇంకొకఆమె చెప్పుతుంది. "ఈ చంద్రహారంకు ఎన్ని కాసులు పట్టింది? మజూరీ ఎంత? ఒకసారి ఇస్తారా? మా ఆయనకు

చూపించి తెస్తాను" అంటూ స్త్రీలమధ్య మాటలు జరుగు తాయి. పేరంటాలలోగాని, సభలలోగాని, ఎక్కడైనాసరే నలుగురు ఆడవాళ్ళు చేరుకుంటే వెలువడే రొద ఇదే. స్త్రీ తాను ధరించే వస్త్ర వాహనాదులతో లేనిపోని ఆడంబ రాన్ని తెచ్చుకుంటుంది. స్త్రీజాతికి ఇంకొక లక్షణం కూడా వుంది. సామాన్యంగా తన ఎదుటవున్న స్త్రీ ధరించిన బట్ట వస్తువులే ఆమెకు తన వాటికన్నా ఎక్కువ మోజు కలిగిస్తాయి. ఒక స్త్రీ ఇంకొకస్త్రీ హోదాను ఆమె ధరిం చిన బట్టలు నగలనే గీటురాళ్ళుగా పెట్టుకుంటుంది. దీనవల్ల లేనిపోని వికారాలు కూడా కలుగుతాయి.

నరసమ్మ చిన్నప్పటినుండి వస్త్ర వాహనాలకు ప్రాము ఖ్యం ఇచ్చేదికాదు. ఖరీదైన దుస్తులు, విలువైన వస్తువులు ఆమెధరించేది కాదు. వీటి విషయంలో కన్పట్టే స్త్రీ జన సహజమైన డాంబికం ఆమెలో గోచరించేది కాదు. "భూష లుగావు మర్త్యులకు భూరిమయూంగద తారహారముల్" అన్న సుభాషితం ఆమె పూర్తిగా అవగాహన చేసుకొంది. మనిషికి అసలైన ఆభరణం శీలమే. శీలం కలుగ చేయలేని సంఘ గౌరవాన్ని అలంకరణవల్ల పొందగలగడం అనేదిభ్రమ అంతమాత్రంచేత ఆమెకు పరిశుభ్రమైన దుస్తులనుకాని, స్త్రీజనయుక్తములైన ఆభరణాలనుకాని ధరించేది కాదని అర్థముకాదు. స్త్రీకి కొన్ని ఆభరణాలు ముఖ్యంగా అవుస

రమే. సౌందర్య ప్రదానములైన ఆభరణ వస్త్రాదులు పూర్తిగా అనవుసరమని ఎవరూఅనలేరు. కాని అవి స్త్రీజన సహాజత్వమును స్ఫురింప చేయడానికి మాత్రమే వుపకరించాలి కాని స్త్రీ అహం భావాన్ని పెంపొందించడానికి తోడ్పడ కూడదని ఆమె భావం. కనుకనే ఆమె నిరాడంబరంగా తాను వుండుటయేకాక నిరాడంబర జీవితం గడిపే ఇతర స్త్రీలను ఎవరినైనా మెచ్చుకొనేది.

ఒకరోజు సాయంకాలం నాలుగు గంటలకు రామా రావు అప్పుడే క్యాంపునుండి తిరిగివచ్చాడు, నరసమ్మ కలంతో కాగితముపై ఏదో తీవ్రంగా ఆలోచించి వ్రాస్తూ ఉంది. "మీ అమ్మను గురించి బెంగపెట్టుకున్నావా ? ఉత్త రం వ్రాసుకుంటున్నావు?" అన్నాడు రామారావు.

"మరే జాగ్రత్తగా పోష్టుచేసి పెడతారా ? పూర్తి అయినాక ఇస్తాను" అంది నరసమ్మ చిరునవ్వు నవ్వుతూ. వ్రాత పూర్తిచేసి భర్త చేతిలో పెట్టింది కాగితం. చూశాడు రామా రావు. అది ఆమె తల్లికి వ్రాసిన ఉత్తరంకాదు. ఆమె రచిం చిన మొట్టమొదటి భజనగీతం, బాలరామాయణం, వ్రాసి ఇవ్వడమేకాదు; శ్రావ్యంగా పాడి వినిపించింది. భార్య భక్తి భావన భర్తను ఆకర్షించింది. "తాడేపల్లి రాముదాసురాల నయ్యా" అన్న ఆ భక్తిగీతంలోని చివరి చరణం రామారావు హృదయానికి హత్తుకుంది.

# నిర్వాకము

తాడేపల్లిగూడెం నుండి రామారావుకు ఏలూరు బదిలీ అయింది. సరైన కాలక్షేపం బోధించిన నరసమ్మ ఇంకొక గ్రామం వెళ్ళిపోవడం తాడేపల్లిగూడెంలోని అమ్మలక్కలకు కష్టం అనిపించింది. రామారావు ఉద్యోగకాలంలో అధిక భాగం ఏలూరులోనే గడుప బడింది.

ఒకరోజు ఉదయాన్ని వెయ్యి రూపాయల కట్టను రామారావు చేతిలోపెట్టి, "దీనితో మీ నాన్నగారు చేసిన ఋణం తీర్చివేయండి" అంది. ఇంత ధనం భార్య ఎట్లా సేకరించ గలిగిందో రామారావుకు అర్థంకాలేదు. తెల్లబోయి, "ఎక్కడిదీ ?" అన్నాడు.

"మీ సంపాదనే" అంది నరసమ్మ. తన స్వల్ప సంపాదనలో ఇంత మొత్తం ఎట్లా నిలువ చేయగలిగిందో రామారావునకు అర్థం కాలేదు.

"మంచి చీర అయినా కొనుక్కోకుండా, ఇంత నిలువ చేశావా ?" అన్నాడు రామారావు.

"ఋణాలు తీర్చిన తర్వాతే చీరల సంగతి. ఇంతకీ నాకు కొత్తచీరలు లేకపోతేకదా !" అంది నరసమ్మ.

"ఏదీ ? ఉంటే చూపించు ?" అన్నాడు రామారావు.

"అబద్ధం ఆడుతున్నా ననుకుంటున్నారా ?" అంటూ

బనారసు పట్టుచీర నొకదానిని తెచ్చింది నరసమ్మ. రామా రావు చూశాడు. అది ఏనాడో ఆమెకు కొన్న చీర. మడత లైనా నలుగకుండా క్రొత్తదిలా అట్లాగే ఉంది. నరసమ్మ దానిని కట్టకపోలేదు. చాలాసార్లు కట్టింది. కట్టి విప్పగానే దులిపి, ఆరబెట్టి, తుడిచి, మడతపెట్టి జాగ్రత్తగా ఉంచేది. ఆమె బట్టలనేకాదు, ఏ వస్తువునైనా అట్లాగే వాడేది. కట్టే బట్ట, వాడే పాత్ర, ధరించే వస్తువు, అన్నీ క్రొత్తగా అప్పుడు కొన్నట్లుగా ఉండేవి.

"ధనమూలం ఇదం జగత్" అన్నారు. అర్థంలేనివాడు వ్యర్థుడు. ధనానికి ప్రజలు అపరిమితమైన విలువనిస్తారు. ఈ భౌతిక ప్రపంచంలో ధనసమృద్ధి కలవానికే సంఘంలో గౌరవం, ఆతని మాటకేవిలువ. సంఘ జీవనానికే కాకుండా, సుఖ జీవనానికి కూడ ధనం చాలా అవసరం. రూపాయి లేక పోతే రోజుగడవదు. మానవుడుచేసే కృషి దినంలో అధిక భాగం ధనార్జనకొరకే. ధనం సంపాదించడం ఎంత కష్టమో, సంపాదించిన ధనాన్ని నిలువచేసుకోవడం అంతే కష్టం. నిజం చెప్పాలంటె సంపాదించి ఇచ్చే వాడి కంటే జాగ్రత్తగా ఆదాచేసి, పొదుపుగా నిలువ చేసేవాడే ఘనుడు.

స్త్రీని గృహలక్ష్మి అన్నారు. ప్రతి ఇంటి ఆర్థిక స్తోమతకు ఆ యింటి ఇల్లాలే కారణం. ఇంటి ఇల్లాలు జాగ్రత్త కలదైతే ఆ ఇల్లంతా ధనలక్ష్మితో కలకల లాడుతూ ఉం

టుంది. అందుకనే 'అమ్మాయి అడుగు పెట్టినవేళ' అంటారు. నరసమ్మ ఆ యింటి గృహలక్ష్మి. ఆమె అడుగు పెట్టిన నాటినుండి ఆ ఇంటిలో ధనానికి కొదువలేదు. ఆమె కాపురానికి వెళ్ళిన కొద్ది సంవత్సరాలలో రామారావు పూర్తిగా ఋణ విముక్తుడు కావడమే కాకుండా మరికొన్ని సంవత్సరాలలో నిలువలో పడి మధ్యతరగతి కుటుంబాలలో చెప్పుకో తగినంత ధనవంతులలో ఒకడయ్యాడు.

నిర్వాకము అనేది పుట్టుకతో పుట్టవలసినబుద్ధి. నేర్పితే ఒకపట్టాన వచ్చేదికాదు. పొదుపుగా జీవించడం అనవసరమైన పటాటోపాలకు పోకుండాఉండడం అనేవి స్వభావ సిద్ధంగా పుట్టుకు రావలసినవే. నరసమ్మ నిరాడంబర జీవితం ఆమె నిర్వాకానికి ప్రబల నిదర్శనం. ఆమె సొమ్ము విలువను పూర్తిగా గుర్తెరిగింది. ఎట్లా ఖర్చుపెట్టాలి ? ఎందుకు ఖర్చుపెట్టాలి ? ఎంత ఖర్చుపెట్టాలి ? అనే విషయాలలో ఆమెకు సునిశితమైన అభిప్రాయాలుండేవి. అనవసర ఖర్చులు చెయ్యక పోవడం ఎంత అవుసరమో, అవసరమయినపుడు సొమ్ము ఖర్చుచేసుకోవడం కూడా అంత అవుసరమే.

పాశ్చాత్య దేశాలలో నిలువ సొమ్మును బ్యాంకులలో దాచుకొనే అలవాటు ఎక్కువగావుంది. దానివల్ల ఖర్చులు పరిమితం అవడమే కాకుండా, నిలువ సొమ్ముకు భద్రత కూడ ఉంటుంది. ఈ అలవాటు మనదేశంలో ముఖ్యంగా

స్త్రీజాతిలో లేదు. నరసమ్మ ఆదాచేసిన సొమ్ము నిలువ చేయడంలో నిపుణురాలు. భర్తజీతం జాగ్రత్తగా కూడబెట్టి ఎప్పటి కప్పుడు సరైన జమాఖర్చు నిక్కచ్చిగా తేల్చి మిగిలిన సొమ్మును బ్యాంకులో వేయించేది. ఎప్పటికి ఏ రోజు వస్తుందో ఎవరూ చెప్పలేరుకదా! నిత్యావసరాలకు పోను అనుకోకుండా వచ్చే ఖర్చులు తట్టుకోవడానికి, ఆర్థికస్తోమత చేకూర్చుకోవడానికి కొంత సొమ్ము నిలువ చేయడం చాలా అవుసరం.



## — 8 —

# పుత్ర జననం

ఆ రోజు కనకమ్మ కూతురు కాపురం చూడ్డానికి ఏలూరు వచ్చింది. కూతుర్ని అల్లుణ్ణి చూచి ఎంతో ముచ్చటపడింది. ధనలోపం కూతురుకు లేదుకదాఅని చాలా సంతోషించింది. కూతురు నిర్వాకాన్ని మెచ్చుకొంది. కనకమ్మకు ఆనాటికే రాజకీయ రంగంలో మంచి పేరు వచ్చింది. గాంధి అడుగు జాడల్లో నడచుకొంది. రాజకీయ సమరంలోమహిళలు కూడా ముందంజ వేస్తున్న రోజులవి. స్వాతంత్ర్య సముపార్జనకు పాటుపడడంలో స్త్రీలు పురుషులకు వెనుక పడరాదని గుర్తించారు. గాంధీజీ శంఖారావం వాడ వాడలా మారు మ్రోగుతోంది. స్వాతంత్ర్య సంపాదన కోసం ప్రజానీకం కదాలు త్రొక్కుతూ, పదాలు పాడుతున్న రోజులవి. ఆపోరాటంలో మహిళలకు కలిగిన సదవకాశాన్ని కనకమ్మ పూర్తిగా ఉపయోగించుకొంది. విదేశీ వస్త్రదహనం, సత్యాగ్రహం మొదలగు దేశీయోద్యమాలలో కనకమ్మ నిర్వహించిన పాత్రకు ఏలూరు పట్టణం జేజేలు పట్టింది. సన్మానసభలు జరిగాయి. కనకమ్మ కూతురువద్ద రెండు రోజులు కులాసాగా గడిపి తిరిగి ప్రయాణం కట్టింది.

"ఇంకో రెండు రోజులు వుండకూడదా? అమ్మా" అంది నరసమ్మ.

"మీ అభివృద్ధి చూచాను కదా ? ఇంక నన్ను వెళ్ళ నియ్యి అమ్మాయి" అంది కనకమ్మ. కనకమ్మకు ఆడపిల్లల ఇంట ఎక్కువకాలం ఉండటం ఇష్టం ఉండేదికాదు.

"నీపని బాగానేఉంది కాని, నీ కడుపున ఒక కాయ కాస్తే చూడాలనివుంది" అంది కనకమ్మ, నరసమ్మతో ప్రయాణానికి ముందు.

నరసమ్మ కాపురానికి వచ్చి చాలా సంవత్సరాలైంది. భగవంతుడు ధనలక్ష్మిని చేకూరుస్తున్నాడు కాని, సంతాన లక్ష్మిని ఇంకా ఇవ్వలేదు.

"నాకు లేకపోతేనే, చెల్లెలు సీతమ్మకు పిల్లలున్నారుగా, వారుమాత్రం నాకు పిల్లలు నీకు మనుమలు కారా ?" అంది నరసమ్మ. నరసమ్మకు చెల్లెలన్నా, చెల్లెలు పిల్లలన్నా చాలా ముద్దు. చెల్లెలు సీతమ్మ పెద్దకొడుకు గాంధీ నరసమ్మ వద్దనే ఉండి చదువుకొనేవాడు.

"ఎంతచేసినా చెల్లెలు పిల్లలు నీ పిల్లలు అవుతారా ? అమ్మాయి" అంది కనకమ్మ. దానికి నరసమ్మ సమాధానం చెప్పలేదు.

'సంతాన ప్రాప్తిరస్తు' అని కూతుర్ని ఆశీర్వదించి కనకమ్మ భీమవరం వెళ్ళిపోయింది. ఆ మర్నాడు రామారావు మేనమామ రామయ్య పూరీజగన్నాథం యాత్ర ముగించుకొని వచ్చాడు. "నాకు ఒక కొడుకు పుడితే నీ పేరు పెట్టు

కుంటాను స్వామీ!' అని జగన్నాథ స్వామికి హృదయ పూర్వకంగా దణ్ణం పెట్టుకుంది నరసమ్మ. దైవ కృపవల్ల, తల్లి ఆశీర్వచనంవల్ల నరసమ్మ గర్భవతి అయింది. ఈ వార్త తెలిసిన కనకమ్మ సంతోషానికి మితం లేదు.

ఆలస్యంగా వచ్చిన గర్భం. ఆరోగ్య పరిస్థితి దృష్ట్యా పురిటికై నరసమ్మను రాజమండ్రి మిషన్ ఆసుపత్రిలో చేర్చ వలసి వచ్చింది. బ్రిటీషువారి పరిపాలనా కాలంలో మన దేశానికి అనేకమంది మిషనరీలు వచ్చారు. క్రైస్తవమత ప్రచారం వాళ్ళ ముఖ్యలక్ష్యం. ఆర్థిక అభివృద్ధిని, ప్రభుత్వ ఉద్యోగాలను ఆశించి అనేక హిందువులు, ముఖ్యంగా హరి జనులు, క్రైస్తవ మతాన్ని స్వీకరించారు. హరిజనులు అగ్రవర్ణాలవారి దృక్పథానికి దూరమై సంఘంలో తక్కువగా చూడబడ్డంవల్ల కూడ వారు క్రైస్తవ మతప్రచారానికి లోనై అన్యమతాన్ని స్వీకరించడం జరిగింది. కనుకనే గాంధిమహా త్ముడు హరిజనోద్ధరణోద్యమాన్ని ప్రారంభించాడు. క్రైస్తవ మత ప్రచారం మాట ఎట్లావున్నా విదేశ మిషనరీలు విద్యా, ఆరోగ్య రంగాలలో మనదేశానికి అమోఘమైనసేవ చేశారు. వారు నిర్మించిన పాఠశాలలు, కళాశాలలు విద్యా వ్యాప్తికి చాలా దోహదం చేశాయి. వైద్య రంగంలో ఆయుర్వేదం ప్రాశస్త్యంతగ్గి, ఇంగ్లీషు వైద్యం ప్రాబల్యం పెరిగింది. మిష నరీలు స్థాపించిన వైద్య శాలలు రోగనివారణకు చాలాకృషి

చేశాయి. వారు ప్రవేశ పెట్టిన శస్త్రచికిత్సా విధానం అనతి కాలంలో గుణంచూపి రుగ్మతను నిర్మూలించేది. రాజమండ్రిలో వారు స్థాపించిన మిషన్ ఆసుపత్రి రెండు మూడు జిల్లాల రోగులకు ప్రధాన కేంద్రం అయింది. ప్రఖ్యాతి వహించిన నెల్సన్ సతీమణి అందు డాక్టరుగా పని చేసేది. ఆమె శస్త్ర చికిత్సా నైపుణ్యం ప్రశంసల నందు కుంది.

నరసమ్మ మిషన్ ఆసుపత్రిలో చేరినది మొదలు నెల్సన్ సతీమణి ఆమె ఎడల ప్రత్యేక శ్రద్ధ చూపించేది. 'సిజేరియన్' ఆపరేషన్ ద్వారా కడుపుకోసి బిడ్డను పైకి తీయవలసి వుంటుందని డాక్టరమ్మ చెప్పింది. శస్త్ర చికిత్స అంటే అందరికీ భయమే. మనుమడు కలుగుతాడనే ఆనం దంలో ఉన్న కనకమ్మకు డాక్టరమ్మ మాటలు అశనిపాతంలా అనిపించాయి. ఆమె ఒక్క నిముషం కళ్ళు మూసింది. తండ్రి సుబ్బారాయుడు కలగా కనిపించాడు. "నీ కుమార్తెకు ఏమీ ఖరవా లేదు; నీకు పండంటి మనుమడు కలుగుతాడు" అని చెప్పాడు. తండ్రి అశరీర వాక్కులంటే కనకమ్మకు చాలా గురి. శస్త్ర చికిత్సకు "సరే"నని అంగీకరించింది. నెల్సన్ సతీమణి నైపుణ్యంతో శస్త్ర చికిత్స చేసింది. నరసమ్మకు మగబిడ్డ కలిగాడు. "నాసీజర్ బాబు" అని ముద్దు పెట్టుకుంది అమెరికన్ వనిత నెల్సన్. ముద్దుగా బొద్దుగా ఉన్న పసికం

దుకు నెత్తిమీద జుట్టు చాలావుంది. పాపిడి తీసి రామయ్య బాబుకు మనుమణ్ణి చూపించింది కనకమ్మ. "అబ్బాయి పాపిడి తోటే పుట్టాడా ?" అని అమాయకంగా ప్రశ్నించాడు రామయ్య. కనకమ్మ ఫక్కున నవ్వింది. "బిడ్డకు దిష్టి తగులు తుంది; పాపిడి చెరిపివెయ్యండి" అన్నాడు రామయ్య.

కొద్ది రోజులలో నరసమ్మకు స్వస్థత చేకూరింది. ఆసుపత్రినుండి విడుదలై ఇల్లు చేరుకుంది, కడుపు కోయించుకు కన్న బిడ్డతో సహా. పుట్టిన బిడ్డను 'జగన్నాథం' అని పిలుచుకొనేవారు. పుత్రజననంతో నరసమ్మ, నరసమాంబ అయింది.



— 9 —

# పెంపకం

నరసమాంబకు ఒక్క మగబిడ్డతప్ప వేరు ఇతర సం తానం ఏమీ కలుగలేదు. ఒక్క కొడుకైనా ఆమె గారా బంగా పెంచి పాడుచేయలేదు. కుమారుని క్రమశిక్షణ విష యంలో ప్రత్యేక శ్రద్ధ వహించేది. ఆరోగ్య విషయంలో కూడ అంతశ్రద్ధా వహించేది. కుమారుడు పెరిగి పెద్దవాడవు తున్నాడు. నాలుగు సంవత్సరాల జగన్నాథం ఆటలలో ప్రక్క ఇంటివారి ఇంట్లోనుండి ఒక బొమ్మ తెచ్చాడు. "ఈ బొమ్మ ఎక్కడదీ?" అని ప్రశ్నించింది నరసమాంబ.

"ఆళ్ళది" అన్నాడు జగన్నాథం వచ్చిరాని మాట లతో.

"ఎందుకు తెచ్చావ్? వెంటనే ఇచ్చేసిరా! అని గదమాయించింది నరసమాంబ. ఆమె దృష్టిలో అది చోరీయే తెలిసి చేసినా, తెలియక చేసినా. ఇతరుల ఇంటికి వెళ్ళి అల్లరి చేసే పిల్లల్ని చూసినా, వాళ్లను అదుపులో పెట్టుకోలేని తల్లి తండ్రుల్ని చూచినా నరమాంబ ఏవగించుకొనేది. తప్పుచేసిన పిల్లల్ని వెనుక వేసుకువచ్చే తల్లితండ్రులంటే ఆమెకు అస హ్యం. చిన్న పిల్లలు అల్లరిచిల్లరిగా తయారయితే దానికి బాధ్యత పెద్దలే వహించ వలసి ఉంటుంది. పిల్లల బాగోగులు పెద్దలమీదనే ఆధారపడి ఉంటాయి. బలపాలు దొంగిలించిన కాలంలో తల్లి కొడుకుని మందలించకపోబట్టే, కొడుకు పెద్ద

వాడై, గజదొంగయి, ఉరిశిక్షకు లోనుకావలసివచ్చి తుది కోర్కెగా తన తల్లిని రప్పించి చెవికొరికిన కథను పిల్లల పెంపకం విషయంలో ఆమె ఎల్లప్పుడు ఉదహరిస్తూ ఉండేది. చిన్ననాడు పిల్లలు అదుపు ఆజ్ఞలు తప్పి ప్రవర్తిస్తే, పెద్దవారయిన తర్వాతకూడ వారి జీవితంలో క్రమ శిక్షణగాని ఔన్నత్యంగాని ఉండదు. పిల్లల పెంపకం విషయంలో తల్లి బాధ్యత చాలా ఉత్కృష్టమైనది. ఆమె కొడుకును ఎన్నడు కొట్టి ఎరుగదు. మాటలతోటే భయం చెప్పేది.

తల్లిదండ్రులు విద్యా బుద్ధులు కలవారైతే పిల్లల విద్యా విషయంలో శ్రద్ధ తీసుకోవడం జరుగుతుంది. విద్య విలువ తెలిసినతల్లి కుమారుని విద్యాభివృద్ధి విషయంలో ప్రత్యేక శ్రద్ధ కనపరుస్తుంది. విద్యా బుద్ధులు నేర్చుకోవలసిన కాలంలో విద్యార్థులు విలాసాలకు, అనవసర స్నేహాలకు లోనైతేవారి భావిజీవితంభగ్నమవుతుంది.దుస్సాంగత్యాన్నుండి తప్పించిమంచిత్రోవనుపెట్టవలసినబాధ్యత తల్లితండ్రులదే.

నరసమాంబ కుమారుని విద్యవిషయమై మిక్కిలి శ్రద్ధ వహించేది. జగన్నాథం తరగతిలో ప్రథముడుగా తప్ప ద్వితీయుడుగా ఉత్తీర్ణుడు కావటానికి వీలులేదు. నిర్ణీత కార్యక్రమం ప్రకారం విద్యాభ్యాసం జరుగవలసినదే. సాయంకాలం ఆరున్నర గంటలకల్లా భోజనంచేసి రాత్రి ఎనిమిది గంటల వరకు చదివి, పడుకొని తిరిగి తెల్లవారఘట్ల నాలుగు

గంటలకు లేచి, చదువుకొన వలసినదే. సరైన కార్యక్రమం ప్రకారం దినచర్య జరిగిపోవాలంటే ఆరోగ్యం లోపం కాకూడదు. నరసమాంబ కుమారుని ఆరోగ్య రక్షణకు కావలసిన చర్యలన్నీ తీసికొనేది. సకాలములో పరిశుభ్రమైన పదార్థాలు భుజించడం, వారం వారం అభ్యంగన స్నానం చేయడం, ఋతువుల మార్పుతో పాటు జీర్ణకోశాన్ని శుద్ధిపరచడం, ఇవన్నీ ఆమె చక్కగా పాటించేది. చిన్నపిల్లలకు పెద్దల ఎంగిలి పెట్టడం ఆమె సహించదు.

పరిశుభ్రత అనేది నరసమాంబకు చాలా ప్రాధాన్యం గల విషయం. పరిశుభ్రత, ఆచారం అనే పదాలలో పరిశుభ్రతే మొదటిది. హిందూ స్త్రీలలో ముఖ్యంగా పూర్వకాలం వారిలో మనం ఇప్పట్లో చూసేది ఆచారమేగాని పరిశుభ్రత కాదు. ఆచారమనేది బాహ్యాడంబరంగా మిగిలిపోయింది. "వంట మడిగా చెయ్యాలి" అంటే నాలుగుసార్లు స్నానంచేసి తరతరాల నుండి వాడుకొంటున్న మురికితో కూడిన పట్టుబట్ట అనేదానిని కట్టుకొని వర్తించాలని అర్థం కాదు. పరిశుద్ధమైన ఆహార పదార్థాలను, పరిశుభ్రమైన వస్త్రాలు ధరించి వర్తించడమే సరైన ఆచార లక్షణం. క్రమేపి ఆచారం అనే పదానికి అసలైన అర్థంపోయి అది ఛాందసంతో కూడిన ఒక అలవాటుగా మిగిలి పోయింది.

నరసమాంబ పరిశుభ్రత అనేది కుంటుపడి పోవడం వప్పుకొనేది కాదు. ఇంట్లో ఎవరి పాత్ర వారిది, ఎవరు తాగే గ్లాసు వారిది; ఎవరిపీట, కంచం వారిది; ఎవరి పక్క బట్టలు వారివి. శుభ్రముగా కడగని ఏ వస్తువునూ ఉపయోగించేదికాదు. ఆఖరికి విక్రయదారు శుభ్రం లేనివాడైతే వానివద్ద వస్తువులు ఖరీదుకూడా చేసేదికాదు. వండిన పదార్థాలపై పెట్టిన మూతలు కాస్త కదిలినట్లు అనుమానం వస్తే ఆ పదార్థాన్ని ఉపయోగించేది కాదు. త్రాగే నీరు వడగట్టి ఆమె స్వయంగా తెచ్చేది. ఆరోగ్యం లోపించే ఎట్టి పనులు ఆమె చేసేదికాదు, చుట్టుప్రక్కల వారిని చేయనిచ్చేదికాదు.

పిల్లలకు దీపావళి, వినాయక చవితి అంటే చాలా సరదా అయిన పండుగలు. చవితి పండుగనాడు ఉదయం తొమ్మిది గంటలకల్లా జగన్నాథంచేత పూజ చేయించి, పిండి వంటలతో భోజనం పెట్టేది. అసలామెకు పెందరాళే తేమలడం అంటే సరదా. చెల్లెలి కొడుకు గాంధి, జగన్నాథం కలిసి పోటా పోటీగా వినాయకుని పూజ చేస్తున్నా, దీపావళి నాడు మతాబులు కాలుస్తున్నా నరసమాంబ చాలా సంతోషించేది. పండుగలు నెల్లాళ్లకు వస్తాయనగానే రోజులు లెక్క పెట్టుకుంటూ కూర్చునేవారు పిల్లలిద్దరూ.

జగన్నాథం అంటే నరసమాంబకు పంచ ప్రాణాలు. జన్నాథంకు కాస్త ఒళ్ళు వేడెక్కిందంటే నరసమాంబకు

అన్నం సయించేది కాదు. మనిషిని జాగ్రత్తగా కనిపెట్టి చూచినకొద్దీ ఆందోళన కలిగించే రోగాలొస్తాయి కాబోలు! జగన్నాథం ఆరోగ్యం ఎంత జాగ్రత్తగా చూచినా ఎప్పుడూ ఆందోళన కలిగించే ఏదో ఒక రోగం వస్తూనేఉండేది.

ఒకరోజు ఆటలాడుకు వచ్చిన పిల్లవాడు మంచం మీద పడుకున్నాడు. ఒళ్ళు చూసేసరికి వెచ్చగాఫుంది. ఇంకేముంది ? నరసమాంబ దిగాలుపడి కూర్చుంది. ఆ రాత్రి ఇంట్లో ఎవరికి భోజనాలు లేవు. జగన్నాథం జ్వరం మర్నాటికి కూడా తగ్గలేదు. లంకణాలు పెరిగి పోతున్నాయి. ఊళ్లో డాక్టర్లు ఒక్కొక్కరు చూచి వెళ్లారు. పొత్తికడుపు కొబ్బరికాయలా పెరగడం ప్రారంభించింది. "అబ్బే ఏమీ లేదు. నీరుడు తీసేస్తే కడుపు అప్పుడంలా అయిపోతుంది" అన్నాడు ఒక డాక్టరు. ఆయన అనుకొన్న పనిచేసినా రోగం తగ్గలేదు.

"ఈ ఇంజెక్షన్‌తో సరి" అని ఉత్సాహ పరిచాడు ఇంకొక డాక్టరు. కాని ఫలితం కలుగలేదు. నరసమాంబ ఆతృత చూచి ఈ డాక్టరును వెనుకటి డాక్టరే తెచ్చాడు. అసలు ఆ రోగ స్వభావం ఆ ఊళ్లో ఏ డాక్టరుకు అర్థంకాలేదు పిల్లాణ్ణి లంకణాలు కట్టేస్తున్నారు. కాని జ్వరం తగ్గడంలేదు. కడుపు ఎత్తు తీయడంలేదు. నరసమాంబ బెంగతో కృశించి పోయింది. ఏం చెయ్యాలో తోచడం లేదు. "అబ్బాయిని

విశాఖపట్నం తీసుకొని వెడితే బాగుంటుంది” అన్నాడు ఆ వచ్చిన డాక్టర్లలో ఒకడు ఆఖరికి ప్రాణం విసిగి.

బిడ్డను విశాఖపట్నం తీసుకొని వెళ్ళారు. విశాఖ పట్నంలోని ప్రభుత్వ ఆసుపత్రి ఆంధ్రదేశంలోని పెద్దఆసుపత్రు లలో ఒకటి. ఎక్కడెక్కడి రోగులు ఇంకెక్కడా గుణం కని పించకపోతే అక్కడకు చేరుకుంటారు. ఇంగ్లండు నుండి వచ్చిన ఇంగ్లీషు డాక్టర్లే ఆ రోజుల్లో పెద్దడాక్టర్లుగా ఉండే వారు. జగన్నాథాన్ని ఆసుపత్రిలో చేర్చారు. డాక్టర్ కోలెన్స్ పరీక్షించి “ కడుపులో కురుపు వేసింది; వెంటనే ఆపరేషన్ చెయ్యాలి, యిరవైనాలుగు గంటలలో ఇది జరుగక పోతే పిల్లవాడు జీవించడం కష్టం” అన్నాడు. నరసమాంబ కంట తడిపెట్టింది.

“భగవంతునిదే భారం, సరే కానివ్వండి” అంది.

ఆపరేషన్ జయప్రదంగానే జరిగింది. మత్తుమందు ఇచ్చిన జగన్నాథానికి ఇంకా స్పృహ రాలేదు. ఆపరేషన్ థియేటర్‌లోనుండి జగన్నాథాన్ని తీసికొచ్చి మంచంపై పడు కోపెట్టారు.

“అబ్బాయి చేతినుండే ఉంగరం ఏమయింది?” అన్నాడు రామయ్య.

“పోనీలెండి అబ్బాయిని కదిపి వెదకవద్దు” అంది నరస

మాంబ కుమారుని ఎక్కడ కదిపి వెదుకుతారో అన్న భయంతో.

ఆ మాటలు విన్న నర్సు ఒక అరగంట పోయాక "ఇదిగోనండీ, ప్రక్కమీద పడివుంది ఉంగరం" అంటూ ఇచ్చింది నరసమాంబకు.

"అబ్బాయికి జయప్రదంగా ఆపరేషన్ జరిగింది, అంతేచాలు. ఇది నీవేఉంచుకో" అని బహుమతిగా ఇచ్చింది ఆ ఉంగరాన్ని నర్సుకు.

"అబ్బే! ఎందుకండీ!" అంటూనే జేబులో పెట్టుకుంది నర్సు ఆ ఉంగరాన్ని.

జగన్నాథం క్రమేపీ కోలుకొంటున్నాడు. అబ్బాయి మంచంమీద నుంచి లేచి కాస్త ఇటూ అటూ తిరగడం మొదలు పెట్టేవరకు మంచం ప్రక్కనే నిలుచుని ఉండేది నరసమాంబ. ఆమె కాళ్ళు పెద్ద స్తంభాలల్లే వాచాయి. అయినా ఆమెలెక్క చెయ్యలేదు. నిద్రలేక కళ్ళు ఎర్రగా అయ్యాయి. అయినా ఆమె కునుకు పోలేదు. ఆమెను చూస్తున్న డాక్టర్లకు ఆశ్చర్యం, జాలి వేసింది. "పడక కుర్చీ వేసుకొని పక్కనే పడుకో అమ్మా; లేకపోతే మీ ఆరోగ్యం పాడవుతుంది" అనేవారు. "ఫరవా లేదు లెండి" అంటూ ఆమె అట్లాగే నిలబడిఉండేది. నరసమాంబ కొంచెం పొట్టి మనిషి పడక కుర్చీమీద పడుకొని ఉంటే కొడుకు ముఖం కనిపించ

దేమోనని ఆమె భయం. భగవంతుని దయవల్ల జగన్నాథం తిరిగి మనుష్యులలో పడ్డాడు. ఆసుపత్రినుండి ఇంటికి వెళ్ళ వచ్చునన్నారు. నరసమాంబ చాలా సంతోషించింది. ఇంటికి తిరిగి వచ్చారు. రైలులో వస్తూవుంటే దారిలో కొండమీద అన్నవరం సత్యన్నారాయణస్వామి గుడి కనిపిస్తుంది. "నాబిడ్డను నాకు తిరిగి ఇచ్చావు. ఇవే నా దణ్ణాలు" అని మొక్కింది నరసమాంబ. అప్పటికే వైద్య వృత్తిలో ప్రవేశించిన సోదరుడు జనార్దనం కూడా ఉండి చేసిన సహాయం నరసమాంబ ఎన్నడూ మరచిపోలేదు.



# — 10 —

## కొన్ని విశిష్టలక్షణాలు

నరసమాంబకు ఇతరస్త్రీలతో ఎక్కువగా జోస్తీ కలుపు కోవడమన్నా, లేక వారి విషయాలలో అనవసరంగా జోక్యం కలిపించు కోవడమన్నా ఏమీ ఇష్టం ఉండేదికాదు. మిత భాషిగా ఉండడం చాలా మేలు. ఎక్కువగా పూసుకు, రాసుకు తిరిగితే అది స్నేహ సంబంధాన్ని అభివృద్ధి పరచ డానికి బదులు, విభేదాలకు దారితీస్తుందని ఆమె అంచనా. తణుకులో నరసమాంబ కాపురం ఉండే కాలంలో ఇంటికి ఎదురుగా ఉన్న ఇంటి ఉత్తరవైపు వాటాలో లాయరు లోక నాథంగారు, దక్షిణవైపు వాటాలో తాలూకా సిరస్థదారు అవతారంగారు కాపురం ఉండేవారు. లోకనాథం భార్య రామమ్మకు, అవతారం భార్య తులశమ్మకు మొదట్లో చాలా స్నేహం ఉండేది, ఇద్దరు ఒకర్ని విడిచి ఒకరు వుండే వారు కాదు. 'ఒదినగారూ!' అంటూ ఒకరిని ఒకరు వరు సలు పెట్టి పిలుచుకొనేవారు. పేరంటాలకు, సినీమాలకు, ఒకచోట కేమిటి? ఇల్లు కదిలితే ఇద్దరూకలిసి వెళ్లవలసినదే. ఇంట్లో వున్నంతసేపు ఒకర్నివదలి ఒకరు వుండేవారుకాదు.

"వదినగారూ! నే వండిన పనస పొట్టుకూర రుచి చూడండి. అంతా మీరే తినక కాస్త అన్నగారికి కూడ

రుచి చూపించండే!” అంటూ రామమ్మ తులశమ్మకు ఇచ్చేది.

“ఇదిగో ఈ కొత్త మాగాయిలో ఉప్పుకారం సరిపో యిందో లేదో చూచి చెప్పండి” అంటూ తులశమ్మ రామ మ్మకు ఇచ్చేది.

ఇద్దరికీ ఒకే పనిమనిషి, ఒకే పాలవాడు, ఒకే చాకలి ఉండేవాడు. అంతా ఉమ్మడే. అసలు ఇద్దరు స్వయాన అప్ప చెల్లెళ్ళు ఏమో అనుకొనేవారు తెలియనివారు. పని మనిషి లచ్చి చాలా తెలివైనది. తులశమ్మ వద్ద తులశమ్మ మాట రామమ్మ వద్ద రామమ్మమాట చెప్పేది. లచ్చిని తనవ నివైపు మొగ్గు చూపేలా చేసుకోడానికి ఇద్దరూ చాలా తాపత్రయ పడటం మొదలు పెట్టారు. లచ్చి అభిమానం సంపాదించ డానికి తవ్వేడు బియ్యపు అన్నం రామమ్మ పెడితే, వెంటనే తులశమ్మ లచ్చికి పాత చీర ఇచ్చేది. రామమ్మ, తులశ మ్మలు పోటా పోటీగా లచ్చికి ఇల్లంతా దోచి పెట్టడం మొదలు పెట్టారు. దానితో రామమ్మ, తులశమ్మల మధ్య కాస్త సంబంధాలు బెడిశాయి. లచ్చిరామమ్మతో మాట్లాడ డం చూస్తే తులశమ్మ చురచురా చూసేది. లచ్చి తులశ మ్మతో మాట్లాడడం చూస్తే రామమ్మ వేళ్ళు విరుచుకొనేది. లచ్చి వీధిపాచి చేసి రామమ్మగారి వాటా వైపు తుక్కు అంతా తన వాటావైపు గెంటివేస్తోందని తులశమ్మ లచ్చితో

దెబ్బలాడేది. "తెల్లవారే టప్పటికల్లా మా ఆయనగారికోసం పార్టీలు వచ్చిపడతారు. వీధివాకిలి ఊడ్చకుండా తులశమ్మ గారి దొడ్డి పాచికి ఏమి తొందర వచ్చిందే!" అని రామమ్మ దెబ్బలాడేది లచ్చితో. రామమ్మ, తులశమ్మల మధ్య ప్రారంభం అయిన ఈ ప్రచ్ఛన్న యుద్ధం క్రమేపీ బాహాటంగా స్వేచ్ఛా రణరంగంగా రూపొందింది. మొదట్లో ఇద్దరూ ఏ కాకి మీదనో, ఏ కుక్క మీదనో వంకపెట్టి తిట్టుకోనడం ప్రారంభించారు. రామమ్మ, తులశమ్మల మధ్య ఏర్పడ్డ ఈ అంటువ్యాధి కాస్త వారి భర్తలకు కూడ సోకింది. అంత వరకు అన్యోన్యంగా ఉంటూ వచ్చిన లోకానాథం, అవతారంగార్లు కూడ ఎడముఖం, పెడముఖంలోనికి దిగారు.

ఆ రోజు సోమవారం. లచ్చి నూతిపళ్లెంలో తులశమ్మ గారి అట్లకాడ తోముతోంది. రెండు వాటాల వారివి మేలెడు అంట్లుపడి ఉన్నాయి.

"ఏమే! ఇత్తడి సిబ్బి తోలిచి ఇమ్మంటే ఎందుకు ఇవ్వలేదు? నీతో చెప్పి ఎంతసేపు అయింది? వెంటనే తీసుకురా, పొయ్యి మండిపోతోంది" అంది రామమ్మ. దానితో తోముతున్న అట్లకాడను కాస్త ఎడంగా పెట్టి ఇత్తడి సిబ్బి మీదకు చేతులు పోనిచ్చింది లచ్చి.

"ఏమే? నీకు ఏం పోయేకాలం వచ్చిందే? అట్లకాడ వెంటనే తెమ్మంటే తేవు. వేపుడు మాడిపోతోంది!" అంది

తులశమ్మ. లచ్చికి ఏమి చెయ్యాలో తోచలేదు. గుప్లు అప్పచెప్పి ఇద్దరి పనులు ఆపేసి చూడడం మొదలు పెట్టింది.

"అయ్యగారి ఆఫీసుకు టైం అయిపోతోందే; పద కొండు గంటలు కొట్టేసరికల్లా ఆఫీసుకు వెళ్లాలి. ఆయనగారు చెట్టుకి్రంద ప్లీడరుకాదు, బాతాఖానీ కొడుతూ మెల్లిగా వెళ్ళడానికి!" అంది తులశమ్మ.

"బల్లకి్రంద చేతులు చాపే ఉద్యోగానికి తొందర ఏమీ లేదులే! వెంటనే ఇత్తడిసిబ్బి తీసుకురా!" అంది రామమ్మ.

"ఏమిటే కూస్తున్నావ్? ఎవరే బల్లకి్రంద చేతులు చాపేది? బల్లమీద కూర్చునేవాడికి చేతులు నలిపే ప్లీడరీ అనుకున్నావా, మా వారిది?" అంది తులశమ్మ (ప్రత్యక్ష యుద్ధరంగంలోకి దుముకుతూ.

"మాది స్వతంత్ర వుద్యోగమే, ఎవర్ని లెక్కచేయ నవుసరంలేదు, బైటైడుతోక నౌకరీకాదు" అంది రామమ్మ. దానితో పాకం ముదిరింది. రామమ్మ తులశమ్మ ఒకరిపై ఒకరు వాగ్బాణాలు విసురుకున్నారు. దానితో వాకిట్లో వున్న లోకనాథం, అవతారం గార్లు కూడా దొడ్డిలోకి వచ్చి కురుక్షేత్ర సంగ్రామంలో వారివారి భార్యలు తరఫున ప్రవేశించారు. నోళ్లకు వీలైనంత పదజాలం అంతా అయిపోయి నాక, కొట్టుకోవడానికి వుద్యుక్తులయ్యారు. చుట్టూచేరినజనం

వారిని విడతీసి ఎవరి వాటాలోనికి వారిని పంపించి వేశారు. దానితో ఆ రోజు యుద్ధం ముగిసింది. నాటినుండి లచ్చి యిద్దరి పనులు మానివేసింది. రామమ్మ, తులశమ్మల రోగం చప్పగా కుదిరింది.

మర్నాడు మధ్యాహ్నం ఒకరు చూడకుండా ఒకరు ఎదురింటి నరసమాంబ వద్దకు వెళ్లి వారివారి వాదనలు సవిస్తరంగా చెప్పుకున్నారు. నేరం అంతా తులశమ్మదేనని రామమ్మ, రామమ్మదేనని తులశమ్మ నిరూపించుకోవడానికి తాపత్రియ పడ్డారు. ఆ గొడవంతా నరసమాంబకు తల నొప్పి కలిగించింది. ఎక్కువజోస్తి, వుమ్మడి పరివారం స్త్రీల మధ్య తరచు కలహాలకు కారణ భూతాలౌతాయని ఆమె యిద్దరికి నచ్చచెప్పి పంపించింది.

౨

"కార్యేషు దాసి, కులధర్మ పత్ని" అన్నారు. ఇంటికి చాకిరీ చెయ్యడంలో స్త్రీదే ప్రముఖ పాత్ర. గృహం స్వర్గ సీమలా వుండాలి అంటే స్త్రీ తనపాత్ర సరిగా నిర్వహించాలి. స్త్రీ తన పాత్ర నిర్వహణలో ఏమాత్రం లోపం చూపినా ఆ యిల్లు నరకతుల్యం అవుతుంది. స్త్రీ బద్ధకస్తురాలైతే ఆ యింటి పురుషుని బ్రతుకు అధ్వాన్నమై పోతుంది. పని పాటలు తప్పించుకొని కులాసాగా రోజులు గడిపే స్త్రీ

అయితే ఆ ఇంట్లోని వారికి సౌఖ్యంగా వుండదు. పురుషుడు గృహకృత్యాలలో కష్టపడుతూఉంటే, చూస్తూ తాను పని తప్పించుకు తిరగడం స్త్రీ లక్ష్యం కాకూడదు.

నరసమాంబ తన విధినిర్వహణలో ఎన్నడు జాప్యం గాని, బద్ధకంగాని చూపలేదు. ఓపిక వున్నంత వరకు అన్ని పనులు తానే స్వయంగా చేసుకొనేది. దేహారోగ్యం సరిగా లేకపోయినా, లేని ఓపిక తెచ్చుకొని ఇంట్లోని వారికి ఏవిధమైన లోపం రాకుండా అన్ని పనులు నిర్వహించేది. తన సేవా ధర్మంలో ఆమె వెనుదీసి ఎరుగదు. సంసారస్త్రీకి తన గృహ కృత్య నిర్వహణమే పరమ ధర్మమని భావించింది. తన పని యింకొకరిపై నెట్టివేయడం ఆమెకు గిట్టనిపని. మనపని మనం చేసుకోవడంలో సంతోషమేగాక, శుభ్రతకూడ ఉంటుంది. ఇతర్లమీద ఆధారపడ్డం నిరుపయోగం. స్వశక్తిమీద ఆధార పడ్డం క్షేమకరం. శరీరాన్ని సుఖానికి అలవాటు చేస్తే, శరీర దారుఢ్యమే కాక, మానసిక దారుఢ్యం కూడ పోతుంది. స్త్రీ ఎంత చురుకుగా, సంతోషంగా తన యింటి పనులు చేసుకు పోతూఉంటే ఆమెకంత ఆరోగ్యం ఉంటుంది, ఇం టిలో ఆనందం తాండవిస్తుంది.

చాలామంది స్త్రీలు తలకు గుడ్డకట్టి రోగం నటించి మంచం ఎక్కి యింట్లో మిగిలిన వారిచేత చాకిరీ చేయించుకోవడం చూస్తూ ఉంటాం. ఇంటిపనులకు నౌకర్ల మీద

ఆధారపడడం కులస్త్రీలకుఎక్కువ అయిపోతోంది. పనిమనిషి రాకపోతే ఆమెకోసం ఉదయం అంతా చూచిచూచి, ఆఖరికి చీపురుకట్ట భర్త చేతులలో పెట్టే భార్యలు లేకపోలేదు. పిల్లల పోషణకూడ భర్తపై గెంటే స్త్రీలు ఉన్నారు. భర్త స్నానం చేస్తుంటే "వీడికికూడ రెండు చెంబులు పొయ్యండి" అని పిల్లవాణ్ణి గెంటుతుంది ఒక స్త్రీ. "వంటచేస్తే ఆరోగ్యం పోతుందండీ! ఎవరినైనా వంటలక్కను చూడండి" అంటుంది ఇంకో నాజూకుగల స్త్రీ. చాలా ఇళ్ళలో ఆడది లేచేటప్పటికి కల్లా కాఫీ కుంపటి వెలిగించే పురుషులు లేకపోలేదు. ఈ విధంగా స్త్రీలు తమపనులు తప్పించుకు తిరగడం, నౌకర్ల మీద ఆధార పడడం, వీలైనంత వరకు పురుషుల మీద త్రోసివేయడం, సరసమాంబకు అసహ్యం అనిపించేవి. తమ ఇంట్లోని వారినే సుఖపెట్టలేని ఈ స్త్రీలు ఇంకెవ్వర్ని ఉద్ధరిస్తారో ఆమెకు అర్థం అయ్యేదికాదు. స్త్రీ జీవితం సేవానిరతితో కూడుకొని ఉండాలి. బాల్యంలో తలి దండ్రులకు, యౌవనంలో భర్తకు, వృద్ధాప్యంలో సంతానానికి, అతిథి అభ్యాగతులకు సేవచేస్తూ జీవితాన్ని సేవానిరతితో గడపడం ధన్యజీవుల లక్ష్యాలలో ఒకటి. 'మా యింట్లో పిల్లలకు నీళ్ళుపోసి తలలు దువ్వడానికి దాది వుంది, 'మా ఇంట్లో వంటకు బ్రాహ్మణ్ణి పెట్టుకున్నాం, మా ఇంట్లో బజారు సరుకులు తేవడానికి నౌకరు కుర్రాడున్నాడు, 'ఏమోనమ్మా

చెంబులు తోముకోవడం ఎప్పుడూ ఎరగం, అన్నిపనులు మేము దాసీదానిచేతనే చేయించుకుంటాం' అంటూ స్త్రీలు సగర్వంగా చాటుకుంటూ ఉంటే నరసమాంబకు నవ్వు వచ్చేది.

— 3 —

నరసమాంబ సేవా నిరతురాలేకాక, ప్రేమ స్వరూపిణి కూడ. బంధు మిత్రులను హృదయ పూర్వకంగా ప్రేమించేది. వారి యోగక్షేమములు తెలుసుకుని సంతోషించేది. వారి శుభాశుభాలలో పాల్గొనేది. ఆమెకు పుట్టింటివారు, అత్తింటివారు అనే భేదం లేదు. ఇరువైపుల వారిని సమాన ప్రేమతో ఆదరించేది. తన కుటుంబానికి సహాయం చేసిన బంధువులకు ఆమె ఎల్లప్పుడు కృతజ్ఞరాలుగా వుండేది. కృతఘ్నత ఆమెకు కష్టం కలిగించేది. స్వప్రయోజన దృష్టితో ఆమె ఎవర్నీ ఎన్నడూ ప్రేమించలేదు. నీతి, నిజాయితీకల ప్రతి మనిషి ఆమెకు ఆత్మీయుడే. ఎవరైనా కావలసినవారు వాకిట్లోకి రావడం చూస్తూనే కాఫీ కుంపటి వెలిగించేది. అధమం కాఫీఅయినా త్రాగకుండా ఇంటికి వచ్చిన అతిథిని వెళ్ళనిచ్చేదికాదు. వచ్చిన బంధువుకు ఏమి యిష్టమో, అది వండి పెట్టేది. వెంకటరామయ్యకు వేడి వేడి పెసరట్లు, రామయ్య బాబుకు భక్ష్యాలు, కృష్ణయ్యమామకు ఉల్లిపాయ పులుసు యిష్టం. అవి తినందే వారిని యింట్లోనుంచి

వెళ్లనిచ్చేదికాదు. కొందరి బంధువులలో ఒకవిధమైన వింత స్వభావం ఉంటుంది. మన యింటికి వస్తే లేనిపోని ఆత్మీయత తెచ్చుకొని మాట్లాడేవారు, మనం వారింటికి వెడితే బిగిసి పోయి మాటా మంతీ లేకుండా కూర్చుంటారు. అటువంటి వారినినరసమాంబ యీవగించు కొనేది.

బంధు మిత్రులను ఎంత ప్రేమించినా వారిలో ఉండే అభ్యంతరకరమైన గుణాలను ఆమె సహించి ఊరుకొనేది కాదు. లోటు పాట్లను చూస్తూ వాటిని కపట ప్రేమతో కప్పిపుచ్చు కోవడం ఆమెకు తెలియని పని. నిర్మొగమాటం ఆమె నైజం. ఒక మనిషిలో ఉండే అభ్యంతర కరమైన స్వభావం మనలో కోపాన్ని రేకెత్తిస్తుంది. మనలో కలిగిన కోపాన్ని అణచుకొని ప్రవర్తించడం ఒకవిధంగా ప్రపంచకంలో కాలక్షేపం చేయడానికి పనికివచ్చినా, అది మన నిష్కాపట్యానికి మాత్రం చిహ్నంకాదు. కోపాన్ని అణచుకొని ప్రేమగా పిలవబూనడం ఒక విధమైన కపటమే. తోచినమాటను మరుగు పరచుకోకుండా ఉన్నది ఉన్నట్లుగా అనడంలో మనం ఎదుటి వారికి కొంచెం కష్టం కలిగించవచ్చు. 'యదార్థవాది బంధు విరోధి' అన్న మాట కొంత వరకు సత్యమే. అంతమాత్రంచేత యదార్థాన్ని కప్పిపుచ్చి లేనిపోని బంధు ప్రేమను ప్రకటించాలని అర్థంలేదు. ఉన్న మాటను పైకి అనడానికి కొంత ధైర్యం ఉండాలి. అంతే

కాదు. తాను పూర్తిగా నిజాయితీ అయిన మనిషి అయితేనే గాని ఎదుటివారిలోగల లోపాన్ని ఎత్తి చూపగల సాహసం వుండదు.

నరసమాంబ బంధుప్రేమ, గుడ్డిదీకాదు, కపటమైనదీ కాదు; అది స్వచ్ఛమైనది, విశిష్టమైనది. ఆమె బంధుమిత్రులలోని లోటుపాట్లు చూపించి వాటిని సరిదిద్దుకోమని హెచ్చరించడానికి వెనుదీసేదికాదు. అందువల్ల ఆమె వారికి తాత్కాలికంగా కష్టాన్ని కలిగించి వుండవచ్చు. కాని దూర దృష్టితో ఆలోచిస్తే ఆమె హితబోధ బంధు మిత్రులకు సరైన మార్గాన్ని చూపెడివవుతుంది. మనసులో ఒకటి పెట్టుకొని బయటకు యింకొకటి మాట్లాడే స్త్రీ కాదు ఆమె.

పొరుగూరు ఏదైనా వెడితే ఆ ఊరులో ఎరుగున్న వారినందరినీ చూచి పలకరించకుండా వచ్చేదికాదు. ఆమెకు ఈర్ష్య, అసూయలు లేవు. వారు వున్నతస్థితిలో ఉంటే చూచి ఆనందించేది. బీదస్థితిలో ఉంటే ఆదరంతో మాట్లాడి తగు సలహాలిచ్చి వచ్చేది.

ఒకనాడు ఆమె ఒక వివాహ సందర్భంలో కాకినాడ వెళ్ళడం సంభవించింది. ఆ వూళ్ళోనే ఆమె చిన్ననాటి స్నేహితురాలు అలివేలు కాపురం చేస్తూంది. అలివేలుభర్త శృంగారం బ్యాంకులో ఎకౌంటెంటు. భార్యా భర్తలిద్దరే ఉన్న చిన్న సంసారం వారిది. ఇంకా పిల్లాజల్లా లేరు. పొద్దు

ప్పుగా కాపురం చేసినట్లైతే అలివేలు నెలకు ఇరవై లేక పాతిక రూపాయలు మిగుల్చుకోవచ్చు. అలివేలు నాజూకైనమనిషి. ప్రతి చిన్న పనికి నౌకర్లను నియమించి రికామీగా కూర్చు నేది. సగం జీతం నౌకర్లకు పోగా, మిగిలిన సగం జీతం ఆమె బట్టలకు సరిపోయేది. ప్రతీనెలా మొదటి మూడు తారీఖుల లోగా భార్యా భర్తలిద్దరూ విలాసంగా జీతంరాళ్లు నాలుగూ ఖర్చు పెట్టేసేవారు. నాలుగవ తారీఖు నుండి శృంగారం ఊరంతా అప్పులు చేసేవాడు.

కొన్నాళ్ళు ప్రశాంతంగానే గడచిన శృంగారం జీవితం గ్రామం అంతా అప్పులు పెరిగిపోవడంతో దుఃఖభా జనమైపోయింది. భార్యా భర్తలిద్దరూ తమ దూబరా ఖర్చు లను తగ్గించుకో లేక పోయారు. భార్యా భర్తల మధ్య క్రమేపీ తగువులు నిత్యం పరిపాటి అయిపోయాయి. మొదట్లో ఇంట్లో గుప్తంగా తగువులాడుకొనే భార్యా భర్తలు ఆఖరికి వీధిని పడడం మొదలు పెట్టారు. భర్త భార్యను కొట్టడం, భార్య ఏడ్చి ముసుగు పెట్టుకొని పడుకోవడం పరిపాటి అయి పోయింది.

నరసమాంబ అలివేలిని చూద్దామని వచ్చి గుమ్మం తట్టేటప్పటికల్లా లోపలినుండి మూలుగు వినిపించింది. అలి వేలు తలగుడ్డ కట్టుకొని మెల్లిగావచ్చి తలుపు తీసింది. నరస

మాంబను చూడగానే అలివేలుకు బాల్యస్మృతులు జ్ఞాపకం వచ్చాయి. వుండబట్టలేక గొల్లుమని ఏడ్చింది.

"గడచిన రోజులే మంచివి సుమా!" అంది అలివేలు.

"సరేగాని, అట్లాగ వున్నావే?" అని ప్రశ్నించింది నరసమాంబ.

"నా ఖర్మం తల్లీ! రోజూ మా ఆయన నన్ను బడితె పూజ చేస్తూంటారు" అంది అలివేలు.

"కారణం?" అని ప్రశ్నించింది నరసమాంబ.

"ఈ రోజు నా పుట్టినరోజు, చీర కొనమంటే చితకబాది పోయారు" అంది అలివేలు.

"మీ ఆయన కొత్తచీర ఎందుకు కొనలేక పోయారు" అంది నరసమాంబ.

"డబ్బులేక, అప్పు పుట్టక" అంది అలివేలు.

"మరి డబ్బులేకపోతే మీ ఆయన్ని కొత్తచీర కొనమని ఎందుకు వేధించావ్?" అంది నరసమాంబ.

దానికి అలివేలు వెంటనే సమాధానం చెప్పలేక పోయింది.

"నా చీరకు డబ్బులేదు కాని, ఆయన సిగరెట్లకు మట్టుకు డబ్బు పుడుతుంది ఎట్లాగో?" అంది అలివేలు కాసేపు పోయాక.

"మీ ఆయన ఎంత కాలంనుండి వుద్యోగం చేస్తున్నారు?" అంది నరసమాంబ.

"చాలా ఏళ్ళనుంచే" అంది అలివేలు.

"మరి వచ్చిన జీతమంతా ఏం చేస్తున్నారు?" అని అడిగింది నరసమాంబ.

"వచ్చిన జీతం అంతా అప్పుల వాళ్లను సముదాయించడానికే సరిపోదు" అంది అలివేలు.

"అన్ని ఋణాలు చేయడానికి మీరు కొత్తగా స్థలాలుగాని, ఇళ్లుగాని కొన్నారా? లేక పిల్లలకు చదువులా? ఆడపిల్లల పెళ్ళిళ్లా? లేక మీ మీద ఆధారపడి బ్రతికేవారు ఎవరన్నా వున్నారా?" అని ప్రశ్నల వర్షం కురిపించింది నరసమాంబ.

"నా మొఖం, అవేమీ లేవు.' అని ఒక్కమాటలో సమాధానం చెప్పివేసింది అలివేలు. అలివేలు, శృంగారాల సంసార విషయం అంతా అర్థమైపోయింది. నరసమాంబకు అసలు మనిషిని చూడగానే పరిస్థితులు అర్థంచేసికోగల శక్తి సామర్థ్యాలు ఉన్నాయి. ఇక లోపల ఆపుకొనలేక పోయింది.

"చూడమ్మా! నీ సంసారం ఇలా అవడానికి నీవే ముఖ్య కారణం. నీ భర్త పెడదారి తొక్కడానికి బాధ్యత ముఖ్యంగా నీదే. వున్నదానితో గడుపుకొని పోవడం నేర్చు

కోసంతకాలం నీ సంసారం ఇట్లానే వుంటుంది. తలకుమించిన ఖర్చులు, విలాసాలు పనికిరావు. వీలైతే నాలుగు డబ్బులు వెనక వేసుకోవాలి. ఒకసారి మీరు ఋణం చేశారంటే, జీవిత మంతా ఋణ గ్రస్తులుగానే వెళ్లబుచ్చ వలసి వుంటుంది. నౌకర్లను మానిపించి నీ పనులు నీవు చేసుకోవాలి. నీ భర్త దూబరాఖర్చులు చేస్తుంటే అదమాయించి సక్రైనమార్గంలో పెట్టుకోవడం నీలోవుంది. అంతేగాని ఊరంతా అప్పులు పెట్టుకొని కొత్తచీరకోసం పట్టుపట్టుకు కూర్చోవడం ఏమీ బాగుండలేదు." అని గబగబా ఉపన్యాస ధోరణిలో నాలుగు మాటలు దులిపి వేసింది నరసమాంబ. ఆమె అన్నమాటలు అలివేలుకు విద్యుద్ఘాతంలా తగిలాయి. సముదాయించి ఆలో చించుకొన్న అలివేలుకు నరసమాంబ చెప్పిన హితోపదేశం లోని యదార్థం బోధ పడింది. ఆమె చెప్పిన మాటలు గురి పెట్టుకొని, తన భర్తకు నచ్చచెప్పి అలివేలు భావిజీవితాన్ని గడిపింది. నాటినుండి అలివేలు జీవితంలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమైంది.

ధనము ఉంటే నలుగురూ మూగుతారు, బెల్లానికి ఈగలు మూగినట్లు. ధనవంతునికి ముఖ్యంగా కలిగే ఈతి బాధలలో ఋణాలు కోరేవారి బాధ ఒకటి. "మాకు ఈవేళ రెండువందలు అత్యవసరంగా కావలసి వచ్చాయి. నాలుగైదు రోజులలో ఒక బాపతు సొమ్ము సర్దుబాటు అవుతుంది. అది

రాగానే మీ సొమ్ము మీకు పువ్వుల్లో పెట్టినట్లు ఇచ్చి వేస్తాను" అంటూ అతి వినయంగా అర్థిస్తాడు ఋణదాతను. కాని సొమ్ము తీసుకొని వెళ్ళేటప్పుడు ఉండే సౌమ్యత, ఋణాన్ని తీర్చేటప్పుడు ఉండదు. ఒకసారి ఋణాలు చేయడానికి అలవాటు పడ్డవాడు, జీవితమంతా ఋణాలు చేస్తూ, ఆజన్మాంతం ఋణస్తుడుగా ఉండిపోవడం తటస్థిస్తుంది. అప్పులలో నుండి బయటపడడం అంటూ ఉండదు. ప్రఖ్యాత ఆంగ్లకవి చెప్పినట్లు 'ఋణం ధనాన్ని, స్నేహాన్ని గూడా పోగొడుతుంది'. వడ్డీలకాసించి ఋణాలకు ఇస్తే అసలుకే మోసం వస్తుంది. ఋణదాతకు చివరకు మిగిలేది ఏదీ ఉండదు. అత్యాశకుపోతే అసలే పోతుంది. అట్టి పరిస్థితులలో ధనం మనకు ఇవ్వవలసిన సౌఖ్యం ఇవ్వదు. మన శ్శాంతిపోయి అసౌఖ్యంఏర్పడుతుంది. కనుకనే నరసమాంబకు అప్పు పుచ్చుకోవడమన్నా, ఇవ్వడమన్నా గిట్టేదికాదు. తన భర్త సంపాదన స్వల్పమైనా, అధికమైనా వచ్చిన దానితో గడుపుకొనేదికాని ఎన్నడూ ఋణంచేసి ఎరుగదు. ఆఖరికి దినకృత్యాలలో వంటకు కావలసిన దినుసులలో కూడ ఏదైనా లోపించినా ఎట్లాగో గడిపివేసేదే, కాని అప్పుచేసి తెచ్చేదికాదు. "పిన్నిగారూ!. ఒక చంచాడు కాఫీపొడి ఉందా? ఇప్పుడే తెప్పించి తిరిగి ఇస్తాను'; 'కాస్త చింతపండు ఉంటే ఇస్తారూ! మా ఆయన సంతనుండి రాగానే ఇస్తాను"

అంటూ అమ్మలక్కలు తెల్లవారి లేచింది లగాయతు అనేక చిల్లర అప్పులు చేస్తూ ఉంటారు. "మీ ఇంట్లో అన్నంవండే శేరుగిన్నె ఉందా; రోకలి ఒకసారి ఇస్తారా?" అంటూ అనేక సరుకులు కూడా ఎరువు తెచ్చుకుంటూ ఉంటారు. సరుకులు తరచు ఎరువు తీసుకొని వెళ్ళేవారికి వాటిని వెంటనే తమపని అవగానే తిరిగి ఇచ్చేస్వభావం ఉండదు. వారలనుతిరిగి అడిగితే పైపెచ్చు కోపం కూడా వస్తుంది. అటువంటి స్వభావాలు నరసమాంబకు గిట్టేవికావు.

# — 11 —

# గృహ నిర్మాణం

తణుకునుండి రామారావుకు భీమవరం బదిలీఅయింది నరసమాంబ చిన్నతనంలో రోజులు గడిపిన ఊరే అది. ఆమె మేనమామ అక్కడే వుంటున్నాడు. భర్త మేనమామ ఊరు ఎండగండికూడ భీమవరానికి దగ్గరలోనే ఉందికదా. బంధువులు చుట్టూ ఉన్నారు. భీమవరం వెళ్ళడం నరస మాంబకుసంతోషం కలిగించింది. ఎక్కడైనఒక స్వంతఇల్లుకట్టు కుంటే బాగుంటుందనే అభిప్రాయం రామారావుకు చాలా కాలనుంచి ఉంది. తను ఉద్యోగం చేసిన ప్రతి ఊరులోను కట్టిన ఇళ్ళుగాని, ఖాళీ స్థలాలుగాని అమ్మకానికి ఉంటే చూస్తూనే ఉండేవాడు.

"ఉద్యోగం నుండి రిటైరు అయ్యాక స్థిరనివాసం ఏర్ప రచుకోవడానికి ఏదో ఒక ఊళ్ళో స్వంత ఇల్లు వుండాలికదా! భీమవరంలోనే స్వంత ఇల్లుకట్టు కొందామా?" అంది ఒకనాడు నరసమాంబ. భీమవరం నీళ్ళు ఆమెకు పడ్డాయి. సుస్తీలు లేకుండా ఇంటిళ్ళపాదీ ఆరోగ్యంగా వున్నారు. చుట్టూ బం ధువులు ఉండడమే కాకుండ ఊరుగూడా పెరుగుతూ ప్రాము ఖ్యం పొందుతోంది.

"అయితే కట్టిన ఇల్లు ఏదైనా అమ్మకానికి ఉంటే చూడనా?" అన్నాడు రామారావు.

"కట్టిన ఇళ్ళయితే మనకు కావలసిన సదుపాయాలు అన్నీ ఉండవు. కట్టుకోవడమే మంచిది" అని చెప్పింది నరసమాంబ. నరసమాంబ సలహాలను రామారావు తప్పకుండా విలువయిచ్చి పాటించేవాడు.

రామారావుకు మొక్కల పెంపకం అంటే చాలా ఇష్టం. విశాలమైన ఆవరణలో మధ్యగా ఇల్లు కట్టుకుంటే చుట్టూ మొక్కలు పెంచుకోవచ్చు. కాని ఇల్లు కట్టడం చాలా కష్టతరమైనపని. అందుకనే 'ఇల్లుకట్టిచూడు'అన్నారు పెద్దలు.

"మంచి స్థలం ఉంటే చూడండి, వెంటనే ఇల్లుకట్టుకుందాం" అని హెచ్చరించింది నరసమాంబ.

విశాలమైన స్థలాలు సాధారణంగా ఊరికి మధ్యగా దొరకవు. దొరికినా ధర చాలా హెచ్చుగా ఉంటుంది. అందుచేత రామారావుకు విశాలమైన స్థలం ఊరికి చివరగా దొరికింది. "కొన్న స్థలానికి ముందు చుట్టూ ప్రహరీ తియ్యండి" అని సలహా యిచ్చాడు, మేనమామ వెంకట్రామయ్య. అంతేకాదు స్థలం ఉన్న ఊరిలో పొలం కూడా ఉండాలి అని కొంత పంటభూమికూడా కొనిపించాడు వెంకట్రామయ్య.

అరఎకరం స్థలం ఊరికి దక్షిణంగా కొన్నాడు రామారావు. వెంకట్రామయ్య సలహా ప్రకారం చుట్టూ ప్రహరీ

తీయించాడు ముందు. వడ్రం మేస్త్రీ వెంకటనారాయణ ఇంటికి ప్లాను వేశాడు. ఎక్కడెక్కడ తలుపులు, కిటికీలు, అలమారులు ఉండాలో సూచించింది నరసమాంబ. గృహ నిర్మాణానికి ప్రయత్నం చురుకుగా సాగిపోతోంది.

"అడుసుతో కంటె సున్నంతో కట్టుబడి జరిగిస్తే చెక్కు చెదరకుండా ఉంటుంది" అని చెప్పింది నరసమాంబ. "సరే!" అన్నాడు రామారావు.

"మీరు పడుకోండి. నేను సున్నం గానుగ తిప్పించి వస్తాను" అని తెల్లవారఝుల్లే వెళ్ళింది నరసమాంబ. తెల్ల వారే వరకూ గానుగ తిరుగుతూనే వుంది. తెల్లవారగానే రామారావు వచ్చాడు. "ఇప్పుడే ఒక నిముషంలో వస్తాను" అంటూ కాపురం ఉంటున్న ఇంటికి వెళ్ళి ఇట్టే తిరిగి వచ్చింది కాఫీ చెంబులో పోసుకొని.

"అప్పుడేకాఫీతయారుచేశావా" అన్నాడురామారావు.

"సరేగాని మీరు కాఫీ త్రాగి, స్నానం చేసిరండి. ఈలోగా నేను బళ్ళమీాది ఇటుక దిగుమతి చేయిస్తాను" అంది నరసమాంబ. ఈ విధంగా గృహనిర్మాణంలో పురుషుడికంటె ఎక్కువగా శ్రమపడి దగ్గరఉండి కట్టుబడి జరిగించింది నరసమాంబ. కట్టుబడి జరుగుతూ ఉన్నప్పుడే వెన్నెల రాత్రిలలో వచ్చి కాసేపు చల్లగా కూర్చుని పోయేవారు, రామారావు, నరసమాంబ స్వంత స్థలంలో.

ముందు వంటగదులు కట్టడం పూర్తి అయింది. వెంటనే గృహప్రవేశం అవడం మంచిదన్నాడు వెంకట్రామయ్య. అయిన గదులలో ఉంటూ మిగిలిన గదులు పూర్తి చేసుకోవచ్చును. కట్టుబడి అంతా పూర్తి కాకుండానే గృహప్రవేశం అయింది.

రామారావు ఇంటి చుట్టూ రకరకాల మొక్కలు పాతి స్వయంగా నీళ్ళుపోసి పెంచాడు. ఆయన మాటలు మొక్కలతోటే. పూసిన పువ్వు కొయ్యడం అంటే ఆయనకు చేతులురావు. చెట్టున వుండగానే చూచి సంతోషించేవాడు. మొక్కలు ఫలించినా,ఫలించక పోయినా ఆయనకుఆనందమే. ఏ మొక్కల మధ్యనో ఉండి పిలిస్తే భోజనానికి కూడా సకాలంలో వచ్చేవాడు కాదు. "ఏమి లబ్ధి చూచుకొని ఆ మొక్కలంటే అంత మురిసి పోతారు ?" అనేది నరసమాంబ.

"చెంబుడు నీళ్లు పొయ్యనిదానివి నీకేం తెలుస్తుంది?" అని వెక్కిరించాడు రామారావు.

"నేను నీళ్ళు పొయ్య నవుసరమూ లేదు ! నాకు మీ మొక్కల పువ్వులు అక్కరలేదు !" అనేది నరసమాంబ. "వద్దంటే తప్పేతుందేమిటి!"అంటూ పువ్వులు అందించేవాడు రామారావు. నవ్వుతూ తీసుకొనేది నరసమాంబ.

గృహ నిర్మాణం పూర్తి కాకుండానే రామారావు కొవ్వూరు బదిలీఅయింది. "నేనుఉండి మిగతాపని పూర్తిచేయిస్తాను" అంది నరసమాంబ.

రామారావు కొవ్వూరు వెళ్ళిపోయాడు. భీమవరంలో నరసమాంబ, జగన్నాథం, కట్టుబడి పూర్తి కావస్తున్న ఇంట్లో ఉండేవారు. అప్పుడు జగన్నాథం స్కూలు ఫైనలు చదువుతున్నాడు. అంత పెద్ద ఆవరణలో, ఊరికి చివరగా ఇద్దరే ఒంటరిగా ఉంటానికి నరసమాంబ ఎన్నడు భయపడలేదు. జీవితంలో ఆమెకు భయం అంటే ఏమిటో తెలియదు.

ఒకరోజు అర్ధరాత్రి ఆమె పడుకున్నగది వెలుపల చప్పుడు అయింది. తలుపు సందులోంచి చూస్తే ఇద్దరు వ్యక్తులు చోరీ చేయడానికి పనిముట్లతో సిద్ధంగా ఉన్నారు. "దొంగ, దొంగ" అని పిలిచినా పిలుపు దూరంలో ఎవరూ లేరు.

"అబ్బాయిని లేపండి! అప్పుడే టయిం నాలుగయింది. లేచి చదువుకునే వేళ అయింది" అంటూ ఆమె కొంత బిగ్గరగా అరచింది. ఆ మాటలు బయటఉన్న దొంగలు విన్నారు. ఇంట్లో చాలామంది వున్నట్లు, తెల్లవార వస్తున్నట్లు వారికి తట్టి, వెంటనే అక్కడనుండి పరుగు తీశారు. ఇంట్లో మూడవ వ్యక్తి లేకపోయినా ఆమె సమయస్ఫూర్తితో నిర్భయంగా అన్నమాటలు చక్కగా పనిచేశాయి. గృహ నిర్మాణం పూర్తయింది. ఇంటి పోర్టికోకు అలంకరించిన సరస్వతీ విగ్రహం నరసమాంబ విద్యానిరతికి ఒక చిహ్నం. "శ్రీకృష్ణ ప్రేమ వీక్షణసౌధం" అని తన గృహాన్ని పిలుచుకొనేది నరస

మాంబ. వచ్చిపోయే బంధు మిత్రులకు సంతోషంగా చూపించుకొనేది తాము నిర్మించు కొన్న సౌధాన్ని. ఆ సౌధం ఆమె నిర్వాకానికి ఒక ప్రతిఫలం. ఆదిలో ఊరికి చివర ఉండే ఆ భవనం ఊరు పెరగడంతో ఇప్పుడు ఊరికి మధ్య అయింది. క్రొత్తగా వెలసిన ఆ పేటను 'రాం నగర్' అని రామారావు పేరిట పిలుచుకొంటున్నారు చుట్టుపక్కలవారు. జగన్నాథం హైస్కూలు విద్య పూర్తి అయింది. ఇక కళాశాలకు ఉన్నత విద్యకు పంప వలసివచ్చినది. నాటికి పశ్చిమ గోదావరిజిల్లాలో కళాశాలలు లేవు. రాజమండ్రి ప్రభుత్వ కళాశాల ఉన్నత విద్యాభ్యాసానికి అనువైన చోటుగా వుండేది. స్కూలుఫైనలు పరీక్షలో ఎక్కువ మార్కులు వచ్చిన వారికే అక్కడ ప్రవేశం దొరుకుతూ వుండేది. జగన్నాథాన్ని రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో ప్రవేశ పెట్టడానికి నిర్ణయించుకున్నారు. ఉన్నత విద్యకు జగన్నాథం రాజమండ్రి వెళ్లడంతో తల్లీకొడుకుల మధ్య ఎడబాటు కలిగింది. కొడుకుని వదలి వుండడం నరసమాంబకు చాలా కష్టం అనిపించింది. కాని తప్పనిసరి.

"జాగ్రత్తగా ఆరోగ్యం కాపాడుకుంటూ చదువుకో బాబూ! వేళకు మట్టుకు అన్నం తిను. వారానికి ఒక వుత్తరం వ్రాయి" అని కొడుక్కి పీడుకోలు చెప్పింది నరసమాంబ. జగన్నాథం రాజమండ్రి వెళ్లిన కొద్ది కాలానికే రామారావుకు తిరిగి భీమవరంకు మార్పు వచ్చింది.



# కోడలు

స్వంత ఇంట్లో వుంటున్నామన్న ఆనందం కొంతవున్నా కొడుకుని వదలి వుండడం దుర్భర మనిపించింది నరసమాంబకు. జగన్నాథం కాలేజీ చదువు పూర్తిచేసి ఇల్లు చేరుకొనేలోగా ఒంటరిగా వుండడం కష్టం అనిపించింది. జగన్నాథానికి అప్పుడే అనేక పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి. ధనవంతులు హోదా కలిగినవారు అనేకులు ఒత్తిడి చేస్తున్నారు తమ పిల్లలను చేసికోమని.

"పోనీ అబ్బాయికి పెళ్ళి చేస్తే కోడలువచ్చి యింట్లో ఉంటుంది. మనకు అబ్బాయి దగ్గరలేని లోటు వుండదు ఏమంటాను?" అంది నరసమాంబ ఒక నాడు రామారావుతో.

"ఇంత తొందరలో పెళ్లి ఎందుకు; చదువు పూర్తి అయ్యాక పెళ్ళి చేస్తే బాగుంటుంది కదా," అన్నాడు రామారావు.

"నిజమేకాని, ఒంటరిగా ఉండటం కష్ట మనిపిస్తోంది, ఇంట్లో కోడలు పిల్ల తిరుగుతూ వుంటే కొంత కాలక్షేపం అవుతుంది. ఇంట్లో ఆడపిల్లలులేని లోటు తీరుతుంది." అంది నరసమాంబ.

"అయితే నీ ఇష్టం" అన్నాడు రామారావు.

బ్రాహ్మణ కుటుంబాలలో చదువు, ఆస్తి, రూపంలో వున్న పెండ్లికొడుకు దొరకడం చాలా కష్టం. ఒక ఆడపిల్లకు పెళ్లి చెయ్యాలంటే ఏడు జతలు చెప్పులు అరిగేటట్లు తిరగాలన్నారు పెద్దలు. పెండ్లి సంబంధం కుదుర్చుకోవడం ఒక విధమైన కళే అని చెప్పాలి. దానికి చాలా చాలా చాకచక్యం వుండాలి. మాట్లాడేతీరు, చేసే వాగ్దానాలు, కనపరచే ఆర్భాటం అమోఘంగా పనిజేసినప్పుడే ఆడపిల్లలు గలవాడు ఇష్టే సంబంధం కుదుర్చుకోగలడు,

సత్యనారాయణ బోర్డు వున్నత పాఠశాలలో ఒక వుపాధ్యాయుడుగా వుంటున్నాడు. చెప్పుకో తగినంత పూర్వార్జితపు ఆస్తి లేకపోయినా, ఏదో వుపాధ్యాయ వృత్తిలో కొంత సంపాదించు కుంటున్నాడు. కుటుంబం పెద్దది. ఆడపిల్లలు ముగ్గురు. పెద్దకూతురు వివాహం అయింది. రెండవ కూతురు రమణమ్మ పెళ్లి చేయాలి. జగన్నాథం విషయమైవిని ఏవిధంగానైనా ఆ సంబంధం తన కుమార్తెకు ఖాయపడితే బాగుండు ననుకొన్నాడు. తన కూతురు రంగు రూపం తప్పకుండా ఆకర్షించగల దనుకున్నాడు. నరసమాంబ, రామారావుల పుట్టు పూర్వోత్తరాలు కొంత సేకరించుకొన్నాడు. నరసమాంబ సన్నిహితులకు, తన సన్నిహితులకు చాలా దగ్గర సంబంధ బాంధవ్యాలు వున్నట్లు ఒక వంశవృక్షం ద్వారా విశదీకరించాడు. ఉన్నత పదవులలోవున్న

అనేకులు తనకు సన్నిహితులని మాటల ధోరణిలో ప్రక
టించాడు.

"మీరు ముందు అమ్మాయిని చూచుకోండి. తరు
వాత మిగిలిన విషయాలన్నీ మాట్లాడుకుందాం అన్నాడు
సత్యనారాయణ. పెళ్లి చూపులకు రోజు నిర్ణయించి తప్ప
కుండా రావాలని ఏర్పాటుచేసుకొని వెళ్లాడు సత్యనారాయణ.

రామారావు, నరసమాంబ, జగన్నాథం పిల్లను
చూచుకొన డానికి కైకలూరు వెళ్లారు. పెళ్లి కుమార్తె రమ
ణమ్మను ఒక పాటపాడి వినిపించ మన్నాడు సత్యనారాయణ.
రమణమ్మ ఒకపాట పాడింది. పెళ్లికిముందు కొద్దో, గొప్పో,
సంగీతం చెప్పించడం పరిపాటియే కదా ! ఈ సంగీతాలు పెళ్లి
తోటే అంతమయ్యే పెళ్లి సంగీతాల్లా ఉండి పోతాయో, లేక
సిసలైన సంగీతాలో తేల్చుకోవడం కష్టం. రెండు మాటలు
చిన్నచిన్న ఇంగ్లీషు ప్రశ్నలకు ఇంగ్లీషులోనే సమాధానం
చెప్పించాడు రమణమ్మచేత సత్యనారాయణ. రమణమ్మ
శరీరచ్ఛాయ, రూపం మగపెళ్లి వారిని ఆకర్షించింది సత్య
నారాయణ అనుకున్నట్లుగానే.

నరసమాంబకు తనకు రాబోయే కోడలి విషయంలో
అనేక అభిప్రాయా లుండేవి. తమ కంటె పై అంతస్థుగ ఉండే
పెద్ద తరహా వారి సంబంధం చేసుకుంటే వచ్చే కోడలు నెత్తి
కెక్కి కూర్చుంటుందేమోనని భయపడింది. అందుచేత

సమానస్థాయిలోని పిల్లనే కోడలుగా తెచ్చుకోవడం మంచి దనుకొంది. రాబోయే కోడలు వినయ విధేయతలతో కన్న కూతురులాగ ఇంట్లో మసలుతూ ఉంటే చాలు ననుకొంది నరసమాంబ. భగవంతుడు తనకు ధనం ఏర్పరచినందున ఆమె కట్నం విషయములో ఏమీ పట్టుబట్టలేదు. "నాకు ఒక్కడే కొడుకుగదా ! కావలసింది ముద్దుముచ్చటె. అబ్బాయి పెళ్లి వైభవంగా చేస్తేచాలు;" అంది నరసమాంబ.

"ముమ్మాటికి మీ ముద్దుముచ్చటలు తీరుస్తాను అంతకంటేనా !" అన్నాడు. సత్యనారాయణ మాటలు తీరును బట్టి పెళ్లి మహా వైభవంగా ,అల్పాహారాలతో, విందు భోజనాలతో, మేళ తాళాలతో జరిపేటట్లు కనిపించింది. సత్యనారాయణ తప్పకుండా తన ముద్దుముచ్చట్లు తీరుస్తాడని సంబరపడింది నరసమాంబ. సంబంధంస్థిరపడింది. పెళ్లి ముహూర్తం నిశ్చయించు కొన్నారు.

మగపెళ్లివారు విడిదిలో దిగారు. ఒక్కగాని ఒక్కకొడుకు పెళ్లికదా ! వివాహ వైభవం చూద్దామని బంధువులంతా వచ్చారు. మంగళసూత్రధారణ ఉదయం అయింది. మధ్యాహ్నం భోజనాలకు సరైన ఆహ్వాన విసర్జనలు లేవు. అందీఅందని పదార్థాలుతిని చేతులు కడుక్కొని లేచారు మగ పెళ్లివారు. నరసమాంబ చాలా నిరుత్సాహ పడింది. అంత మంది బంధువులను ఎరక్కపోయి ఆహ్వానించి తీసుకు వెళ్లానే

అనుకొంది. గడచిన దానికి అనుకొని లాభంలేదు. తనఇంటికి వచ్చిన కోడలు అనుకూలవతి అయితే అంతేచాలుననుకుంది. నరసమాంబకు వియ్యాలవారింట ముద్దుముచ్చట్లు తీర్చుకుందామన్న వాంఛ నెరవేరలేదు.

జగన్నాథం పెళ్లిఅయిన కొన్నాళ్లకే రమణమ్మ కాపురానికి వచ్చింది. కొత్తకోడలికి కష్టం కలుగుతుందేమోనని ఇంటి పనులు అన్నీ నరసమాంబే నిర్వహించేది. రమణమ్మ అత్తను "ఏమండీ!" అని పిలిచేది. ఆ మాట అత్తకు నచ్చలేదు. "అత్తయ్యా, అని పిలవరాదా అమ్మాయి" అంది నరసమాంబ. "ఏమోనాకు సిగ్గండీ!" అంది రమణమ్మ. అత్తను అత్తగానే చూడాలనే వాతావరణంలో మెలిగేది రమణమ్మ. అత్తచేసే పనులను మెచ్చుకోడానికి బదులు వంకలు పెట్టేది. "ఇదిగో ఈ కొత్త చీర కొన్నాను. కట్టుకో అమ్మాయి" అని అత్త ముచ్చటగా ఇస్తే, "అయ్యో! దీనికి అంచు ఇంకాస్త వెడల్పుగా ఉంటే బాగుండేదే! అట్లాఉంచండి" అని మనసు చివుక్కుమనేలా అనేది కోడలు. "ఆపుస్తకంలోని పద్యాలు చదువు అర్థం చెపుతాను" అని అత్త అంటే, "అక్కర్లేదు లేద్దురూ!" అని ముభావంగా అనేది కోడలు. "అమ్మాయి చేతిలో గ్లాసు గట్టిగా పట్టుకో, క్రింద పడిపోతుందేమో" అని అత్త అంటే, వెంటనే గ్లాసును జార

విడిచి, "ఏం చెయ్యమంటారు ? జారి పోయింది" అనేది కోడలు.

ఇంటి పనులలో అత్తకు అసరాగా ఉంటానికి బదులు ప్రతిబంధకంగా ఉండేది కోడలు. అత్తయందు చూపవలసిన అణకువగాని, ఆదరణగాని చూపేది కాదు. జగన్నాథం ఎంత సరిదిద్దడానికి ప్రయత్నించినా లాభం లేకపోయింది. నరస మాంబకు హృదయావేదన కలిగింది. కోడలుద్వారా కుమార్తె లేని లోటు తీర్చుకొందా మనుకొన్న ఆమె కొంత నిరుత్సాహ పడవలసి వచ్చింది. ఎంత చేసినా 'కోడలు కోడలే కదా ! కూతురు కాబోదు కదా !' అనిపించింది నరసమాంబకు.



# మహిళా సంఘం

కాలచక్రం తిరిగిపోతోంది. మహాత్ముడు సాగించిన శాంతిసమరం రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని అస్తమింప చేసింది. 1947 లో మన దేశానికి స్వాతంత్ర్యం లభించింది. పర పాలన పోయి స్వపరిపాలన ప్రారంభం అయింది. కాలం పురోగమిస్తోంది. దేశంలో ప్రజ్వరిల్లిన రాజకీయ సంచలనం నరసమాంబను విశేషంగా ఆకర్షించింది. దేశీయ వాఙ్మయాన్ని ఆమె చదవడం ప్రారంభించింది. హిందూ దేశ రాజకీయ చరిత్రను, మహా పురుషుల జీవిత గాధలను ఆమె ప్రత్యేకించి విరివిగా చదివింది. వాటిని మననం చేసుకొంది. దిన పత్రికను విధాయకంగా చదివేది. స్వతంత్ర భారతదేశంలో స్త్రీలు నిర్వహించ వలసిన పాత్ర ఎంతైనా ఉందనిపించింది ఆమెకు. సరోజినీ దేవి, విజయలక్ష్మి పండిట్, దుర్గాబాయి, అమృతకౌర్, మొదలగు స్త్రీలు నిర్వహిస్తున్న పాత్ర ఆమెకు చాలా ఆదర్శనీయంగా కనిపించింది. స్త్రీలు కూడా పురుషులతో పాటు ముందంజ వేయడంలో వెనుతీయరా దనుకొంది.

స్త్రీజాతి పైకి రావాలంటే వారు ముఖ్యంగా విద్యావతులవ్వాలి. స్త్రీత్వం పరిపూర్ణత చెందాలంటే ఆమె కేవలం గృహకృత్యాలకే అంకితమయ్యి రోజంతా గడపడం కంటె, ఆమె విద్యాశక్తిని కూడ పెంపొందించు కోవాలి.

'ముదితల్ నేర్వగరాని విద్యకలదే, ముద్దార నేర్పించినన్'
అన్నమాటలు అక్షరాల నిజం. స్త్రీకి దీక్షవుండాలి కాని
ఆమె తలచుకుంటే నేర్చుకోలేని విద్య ఉండదు. 'విద్యని
గూఢ గుప్తమగు విత్తము, రూపము' అన్న పదాలు పూరు
షాళికే కాక స్త్రీ జనానికి కూడా వర్తిస్తాయి. విద్యలేని
పురుషుడే కాదు స్త్రీ కూడా పశువే !

విద్యాతృష్ణకు వయోపరిమితిలేదు. అవధులుగాని, అవ
రోధాలుగాని లేవు. నరసమాంబ ఆజన్మాంతం విద్యార్థినియే.
ఎప్పుడూ ఏదో ఒక తెలియని విషయాన్ని గూర్చి తెలుసు
కోవడానికి ప్రయత్నించేది. రాజకీయ పరిణామాలను గూర్చి
రామారావు విశద పరుస్తుండేవాడు. తెలియని విషయాన్ని
ఇంకా ఒకసారి రెట్టించి అడిగేతే రామారావు విసుక్కొనే
వాడు. "అబ్బా ! ఆ విసుగెందుకండీ ! మెల్లగా చెప్పలేరా !"
అనేది ఆమె. స్వయం కృషివల్లనే నరసమాంబ ఆంగ్ల, ఆంధ్ర
భాషలయందు విశేష ప్రావీణ్యతలను సంపాదించింది. తాను
సేకరించుకొన్న విజ్ఞానాన్ని వెదజల్లాలి అనే అభిలాషకూడ
ఉండేది ఆమెకు. తాను చదువుకోవడమే గాకుండా, చదు
వుకున్న స్త్రీలను విశేషంగా గౌరవించేది. ఎవరైనా ఆడ
పిల్లలు కనిపిస్తే "మీా నాన్నగారికి ఏమిపని ?", "మీా ఇంట్లో
ఏం వండుకున్నారు?" అంటూ చొప్పదంటు ప్రశ్నలు అడగ
డం ఆమెకిష్టంలేదు. "నీవు ఏం చదువుకుంటున్నావు ?
క్లాసులో మార్కులు బాగా వస్తాయా ?" అంటూ కుశల

ప్రశ్నలడిగేది నరసమాంబ. స్త్రీకి విద్య అనేది ఆడంబరం కలిగించరాదు. ఎంతవిద్యావతిఅయితేఅంతనిరాడంబరంగాఉం డాలి. విద్యతో పాటు శీలాన్నికూడా పెంపొందించు కోవాలి. స్త్రీ తను సంపాదించిన మిడిమిడి జ్ఞానంతో అహంభావం కలిగి ఉండడం ఆమెకు కిస్టేది కాదు. విద్యావతియై, పవిత్ర శీలంతో నిరాడంబర జీవితం గడిపే ప్రతి స్త్రీకి ఆమె నమ స్కరించేది.

భీమవరం రాజకీయ చరిత్రలో ఉత్కృష్ట స్థానాన్ని సంపాదించుకుంది. దేశ స్వాతంత్ర్య పోరాటంలో సర్వస్వాన్ని త్యజించి ఆత్మార్పణం గావించుకొన్న అనేక అమరవీరులకు పుట్టినిల్లయింది. 'రెండవ బార్డోలీ' అనిపించుకుంది. ఇట్టి భీమ వరంలో నలుగురు మహిళలు చేరి వినోద, విజ్ఞానాలతో కాలం గడపడానికి ఒక సంఘం స్థాపించడం చాలా అవసరం అనిపించింది నరసమాంబకు. ఉత్సాహవంతులైన కొందరు స్త్రీలతో చెప్పిందీ విషయం. వారు "సరే" నన్నారు. నరస మాంబ వారితో పాటు ఇంటింటికి వెళ్ళి స్త్రీలను సభ్యులుగా చేర్పించింది. నరసమాంబంటే మహిళాలోకంలో విశేషమైన విలువ ఉంది. ఆమె విద్యాతృష్ణ, పవిత్రశీలం అనేక సంసార స్త్రీల ఆదరాభిమానాల్ని చూరగొంది. నరసమాంబ స్థాపిం చిన ఆసంస్థలో చేరడానికి ఆ పుణ్యస్త్రీలకు ఏమీ ప్రతిబంధ కం తోచలేదు. భీమవరంలో మొట్టమొదటి సారిగా నరస

మాంబ స్థాపించిన మహిళాసంఘం పురజనుల ప్రశంశల నం దుకొంది. ఆదర్శప్రాయంగా ఆమె సంఘానికి అధ్యక్షపదవి కొన్నాళ్లు నిర్వహించి, పిమ్మట పిన్నవయస్కులైన ఇతరస్త్రీల చేతులలో సంఘ నిర్వాహణ కార్యక్రమం పెట్టి ఆమె తప్పు కుంది.

ప్రజా సంస్థల నిర్వాహకులపై చాలా బాధ్యత ఉంది. సంస్థలు పోగుచేసిన ప్రతి రూపాయి సక్రమంగా వినియోగిం చాలి. నిర్వాహకులు ప్రజలు ఇచ్చిన సొమ్ముకు ధర్మకర్తలు. "మనం పోగుచేసే చందాలకు సరైన జమా ఖర్చు పుస్తకా లుండాలి. ఒక కానీ అయినా మనందు ర్వినియోగం చెయ్య కూడదు" అని నరసమాంబ హెచ్చరిస్తూ ఉండేది. వసూలు చేసిన చందాలు సభ్యులు ఇచ్చిన విరాళాలు సక్రమంగా వినియోగం కావాలని ఆమె ఆశయం. సొమ్ము దుర్వినియో గం అవడం ఆమె సహించేది కాదు. సంఘం అభ్యున్నత పం థాలో నడుస్తూ ఉంటే ఆమె చూచి ఆనందించేది. సంఘ సభ్యులెవరైనా పెడదారి త్రొక్కినట్లుగా ఆమె వింటే మన సులో చాలా బాధపడేది.



# పురపాలక సంఘం

నరసమాంబకు సభలుఅన్నా సమావేశాలన్నా చాలా ఇష్టం. "ఈరోజు గాంధి జయంతి. సభలో నేను కూడా అవకాశం చిక్కితే రెండుమాటలు చెప్పిరానా ?" అని అడిగింది రామారావును నరసమాంబ ఒకనాడు.

"ఊరిలోని పెద్దలంతా వస్తారు. ఇది కేవలం ఆడవాళ్ల సమావేశం కాదుకదా! నీకు భయం వెయ్యదా?" అన్నాడు రామారావు.

"భయం ఎందుకు, నే చెప్పదలచుకొన్నది నిర్భయంగానే చెప్పగలను" అంది నరసమాంబ.

"అయితే నీయిష్టం" అన్నాడు రామారావు.

ఆరోజున సమావేశానికి పుర ప్రముఖులు అంతా వచ్చారు. నరసమాంబకు ప్రసంగించడానికి అవకాశం చిక్కింది. ఆదినం ఆమెయిచ్చిన ఉపన్యాసం అందరిని మెప్పించింది. అనేకులు అభినందించారు ఆమెను.

నాటినుండి అనేక పెద్దపెద్ద సభలలో తరచు ఉపన్యసిస్తూ ఉండేది నరసమాంబ. అందుకు రామారావు పరిపూర్ణ ఆమోదం ఉండేది. సభా పిరికితనం నరసమాంబకు లేదు. పండిత పామర జనాన్ని రంజింపచేస్తు రక్తికట్టేలాగు ప్రసంగించేది. సాధారణంగా ఉపన్యాసకులు వేదికపైకి రాగానే చప్పట్లు చరచడానికి సిద్ధపడే కుర్రకారుకూడ నరస

మాంబ ఉపన్యాసాలను కిక్కురుమనకుండా వినేవారు. చక్కని హాస్యాన్ని, పవిత్రమైన పురాణ గాధలను మేళవించి శ్రావ్యమైన ధోరణిలో ఎంతసేపైనా ఉపన్యసించగల సమర్థు రాలు. ఆంధ్రభాషలో అనర్గళంగా ఉపన్యసించగల మహిళ అని పేరు పొందినది. ప్రతి సమావేశంలోను ఉపన్యసించమని కోరేవారు.

"ఈ దఫా నరసమాంబగారిని మన వార్డునకు పుర పాలక సంఘ సభ్యురాలిగా నిలబెట్ట దలిచాం, దీనికి మీరు సమ్మతించాలి" అని కొందరు రామారావును కోరారు ఒక సారి.

"మీ సమ్మతే నా సమ్మతి. కాని ఆడవాళ్ళలో పోటీ పడితే బాగుండదు కదా!" అన్నాడు రామారావు.

"నరసమాంబగారిమీద పోటీ ఉండదు. మీరు 'ఉ' అనండి. మిగిలిన పనులు మేం చూస్తాం" అన్నారు పెద్దలు. రామారావు. అంగీకరించాడు.

నరసమాంబ 1956 సంవత్సరంలో భీమవరం ఒకటవ వార్డునుండి పురపాలక సంఘ సభ్యురాలిగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడింది. దానితో ఆమెకు పురపాలనా వ్యవస్థలో ప్రముఖపాత్ర నిర్వహించడానికి చక్కని అవకాశం చిక్కింది.

ఇది ప్రజాస్వామిక యుగం. పరిపాలన ప్రజా ప్రతిని ధులద్వారా జరుగుతున్న రోజులివి. భారత దేశం స్వాతం

త్ర్యం పొందిన కొద్దిరోజులకే వయోజన ఓటింగు ప్రవేశ పెట్టబడింది. జాతి, మత, ఆర్థికవిషయాలతో నిమిత్తంలేకుండా ఒక నిర్ణీత వయో పరిమితి దాటిన ప్రతివ్యక్తి ఓటరయ్యాడు. భారీ ఎత్తున ఓటింగు ప్రాతిపదికగాగల ప్రజాస్వామిక దేశా లలో ప్రథమ స్థానం మన దేశానిదే. ప్రజా స్వామికం వర్థిల్లాలంటే సరైన ప్రజా ప్రతినిధులను ఎన్నుకోవాలి. వయోజన ఓటింగు ప్రవేశ పెట్టబడింది. కాని మనదేశంలో వయోజనవిద్యలేదు. ఓటరుకు ఓటు విలువ తెలియాలంటేవిద్య అవుసరం. లేనిచో వోటు దుర్వినియోగం కాగలదు. వయో జన విద్యలేని ప్రజాస్వామికం ప్రారంభ దశలో కొన్ని అనర్థ కాలుకలుగడం సహజం. ఓటర్లు పోటీదార్ల గుణశీలాలను పరి కించి యోగ్యతను నిర్ణయించడం కంటె వారి ధనానికే ఎక్కువ మొగ్గు చూపడం జరుగుతుంది. గ్రామ పంచాయి తీలు మొదలు పార్లమెంటు సభ్యత్వం వరకు జరుగుతున్న ఈ ఎన్నికలలో అనేక అవకతవకలు జరుగు తున్నాయి. ఒక్కొక్కప్పుడు ఈ ఎన్నికల తీరు పరికిస్తే మనదేశంలో సిస లైన ప్రజా స్వామికానికి తావుందా అనిపిస్తుంది. ప్రజా ప్రతి నిధులనుకొనేవారు ఎన్నికైన తర్వాత ప్రజాక్షేమం కంటె తమ స్వప్రయోజనాలకేఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం జరుగు తోంది. ధనం వెచ్చించి ఎన్నికైన వాడు ఏదో విధంగా తిరిగి ధనాన్ని కూడబెట్టుకోవడానికి ప్రయత్నిస్తాడు. ప్రజా సేవ అనేది నామ మాత్రంగా నిలిచిపోతుంది.

నరసమాంబ పురపాలకసంఘ సభ్యురాలిగా ఎన్నికైన నాటినుండి పట్టణ అభివృద్ధికి ఎంతైనా కృషి చేయాలని సంకల్పించుకొంది. ముఖ్యంగా విద్యార్థినుల ఉన్నత పాఠశాల అభివృద్ధికి ఆమె విశేష సేవ చేసింది. పురపాలక సంఘ సభ్యురాలిగా ఆమె ఆసించిన పనులన్నిటినీ చేయడానికి పూర్తి అవకాశం లేకపోయింది. ఒక్కొక్కసారి ఆమె పట్టణ వాతావరణం చూచి విసుగు చెందుతూ ఉండేదికూడ.

కొన్నిలు సమావేశాలకు నరసమాంబ సకాలంలో హాజరయ్యేది. ప్రకటించిన వేళకు సమావేశం ప్రారంభం కాకపోతే ఆమె "అనుకున్నట్లు సకాలంలో అందరూ రానక్కర లేదా ?" అని తోటి సభ్యులను హెచ్చరించేది. ప్రకటించిన కాలవ్యవధి అతిక్రమించటానికి అమె అంగీకరించేది కాదు. ఆమె కాలం విలువను పూర్తిగా ఎరుగును. ఆహ్వానించిన సభకు వెళ్ళకుండా ఉండడంకాని ప్రచురించిన కాలాన్ని అతిక్రమించి హాజరు కావడంకాని ఆమె ఎన్నడు జరిగించలేదు. కొన్నిలు సమావేశాలలో తోటి సభ్యులు నరసమాంబ సలహాలకు ఎక్కువ విలువ ఇచ్చేవారు. ఆమెను గౌరవంగా చూసేవారు.

— 15 —

# కవిత్వం

అష్టాదశ పురాణాలను క్షుణ్ణంగా చదివి అందలి సారాన్ని జీర్ణించుకొన్న వనిత నరసమాంబ. ఆమె విద్యా తృష్ణ వర్ణించ నలవికానిది. ఆమె తనకు కలిగిన భావతరంగా లను ఎప్పటికప్పుడు చక్కని శైలిలో వ్రాసి పెట్టుకొనేది. ఆమెకు ఛందస్సురాదు. "ఛందస్సులోనున్న చందము తెలు గకయే, పొందుపరచితి నీ పాట" అని తొలిదొల్తగా రచిం చిన 'బాలరామాయణం'లో చెప్పుకుంది. అయినను ఆమె రచించిన పద్యాలు ఛందో బద్ధంగానే ఉండేవి. ఆమె ప్రత్యేకంగా కృషిచేసి వ్యాకరణం అభ్యసించక పోయినా, ఆమె ఛందో బద్ధంగా పద్యం చెప్పకలిగిందంటే ఆశ్చర్య కరమైన విషయమే.

భావోద్రేకం కలిగినప్పుడు ఎదురుగా ఏ కాగితం కని పిస్తే దానిమీద వెంటనే వ్రాసేసేది. ఆమె శైలి మృదువుగా ఉండేది. ఏదైనా మాట్లాడుతూంటే చక్కని ఉపన్యాసం ఇస్తూన్నట్లుగా ఉంటూ ఉండేది.

ఆమె తల్లిగారి మరణాన్ని భరించలేక పోయింది. కన కమ్మ అష్టకష్టాలు పడి జీవయాత్ర జరిగించి పరమపదించిన ఉత్తమ ఇల్లాలు. తన తల్లి పడ్డ కష్టాలు నరసమాంబకు ఎల్ల ప్పుడు జ్ఞాపకం వస్తూనే ఉండేవి. నరసమాంబ ఆఖరికి తాను చూసే జంతుజాలాల్లోకూడ తనతల్లి పవిత్ర మాతృ

మూర్తినే చూడకలిగేది. పెంపుడు కుక్క 'లిల్లీ' రూపంలో తల్లి పునర్జన్మ ఎత్తి తన ఇంటికి తిరిగి వచ్చిందేమోనని ఆమె తలపోసి, 'తల్లిప్రేమ' అను పేర నరసమాంబ పద్య పరంపర చెప్పింది. తన మేనమామ మరణానికి చింతిస్తూ నరసమాంబ ఆసువుగా చెప్పిన పద్యాలే 'నివాపాంజలి.' కాపురానికి వచ్చిన కొత్తలో రచించిన 'బాలరామాయణం'తర్వాత నరస మాంబ అనేక పద్యాలు, పాటలు, వ్యాసాలు వ్రాస్తూ వచ్చింది. ఆసువుగా కవిత్వం చెప్పగల సమర్థురాలు. పౌరా ణిక వాఙ్మయం జీర్ణించుకొన్న ఆమెతత్వం భక్తితత్వం. ఆమె రచనలు ముఖ్యంగా భక్తి ప్రపూరితాలు. అనేక లాలి పాటలు, మేలుకొలుపులు, మంగళ గీతాలు వ్రాసి స్త్రీసా హిత్యానికి మెరుగులు దిద్దింది. ఆమె వ్రాసిన మంగళగీతి రేడియోలో ప్రసారితమయింది.

కోటసత్తెమ్మ నిడదవోలు సమీపంలో వున్న రావి మట్లలో వెలసిన గ్రామ దేవత. రామారావు పూర్వీకుల గ్రామం రావిమట్లయే.

"అమ్మాయి, కోటసత్తెమ్మ మీద ఒక దండకం వ్రాసి ఇస్తావా ?" అని రామయ్య నరసమాంబను అడిగాడు ఒకనాడు.

నరసమాంబ వెంటనే 'కోటసత్తెమ్మ' దండకం వ్రాసి ఇచ్చింది రామయ్య బాబునకు. నరసమాంబ తన స్వయం

కృషివల్ల కవితాలోకంలో ఒక స్థానాన్ని సంపాదించుకొంది. ఆమెకు కవితా సన్మానం జరిగింది. జీవితంలో ఆమె తాను ధరించిన ఏ బట్టకు ఇయ్యని విలువను తనకు ఆనాడు బహూకరించిన నూతన వస్త్రానికి ఇచ్చుకొంది. వెంటనే 'ఉపాయనం' అను పేర పద్యం చదివింది. కవితాలోకంలో తనకు కలిగిన విశిష్ట స్థానానికి తనభర్త రామారావునకు కృతజ్ఞతాంజలి సమర్పించుకొంది. తాను వ్రాసిన ప్రతి పాట చివర "తాడిమళ్ళ రామచంద్రదాసు రాలనని" పేర్కొంది. తాను రచించిన పాటలను ఇతరులకు శ్రావ్యంగా పాడి వినిపించడమంటే నరసమాంబకు చాలా సరదా. ఆమె రచించిన అనేక రచనలు ఇంకా అముద్రితంగానే ఉండి పోయాయి. ఆమె సహజ పాండిత్య ధోరణికి పోతనామాత్యుని కవిత్వ పోకడలున్నాయి. ఇతరుల కవిత్వంలోని సరసత చూచి ఆనందించ గల సహృదయత కూడ ఉండేది నరసమాంబకు.



# భక్తివైరాగ్యాలు

నరసమాంబ భక్తురాలు. భక్తి అనేది ఆమెలో చిన్న
ప్పటినుండి ఆవహించి ఉంది. భాగవతం ఆమె అభిమాన
గ్రంథం. అందలి భగవత్పరమైన రచన ఆమెలో అచంచల
మైన భక్తి విశ్వాసాలను కలిగించింది. కృష్ణ పరమాత్మ
ఆమె అభిమాన దైవం. క్షీరాబ్ధి కృష్ణపూజ ఆమె అభిమాన
పూజ. ఆమె భక్తిగీతాలు చాలావరకు కృష్ణ భగవానుని
పరంగానే ఉండేవి. కష్ట పరంపరలలో ఉన్నప్పుడు కృష్ణనామ
స్మరణమే ఆమెకు శరణ్యంగా ఉండేది. "కృష్ణా కృపజూడు
నన్ను, కష్టముల బెట్ట కెపుడు" అని స్వామిని వేడుకొనేది.

సాధారణంగా స్నానాలు చేయడం, టెంకాయలు
కొట్టడం, అగరవత్తులు వెలిగించడం, హారతులివ్వడం ఇవే
భక్తికి చిహ్నాలు అనుకుంటారు. నిశ్చలమైన భగవన్నామ
స్మరణ కంటె ఈ బాహ్యాడంబరాలకే ఎక్కువ ప్రాధాన్యం
ఇస్తారు. మనం చేసే నోములు, వ్రతాలు, పూజలు, అభి
షేకాలు మన మనసును పూర్తిగా భగవంతునిలో లగ్నం
చేయలేకపోతే అవి నిరర్ధకాలని నరసమాంబ ఉద్దేశ్యం. తీర్థ
యాత్రలు మన మనస్సును మనఇంటి విషయాలనుండి దూరం
చేయలేకపోతే అవి వ్యర్థమే. మూఢ నమ్మకాలన్నా, ప్రచా
రపూరితమైన భక్తి అన్నా ఆమెకు ఇష్టంలేదు. చిత్త శుద్ధి

లేని శివపూజలు అనవసరం. మనో శుద్ధిలేని భగవత్ప్రార్థన నిరర్థకం. చిత్త నైర్మల్యం సర్వోత్కృష్టమైన భక్తిమార్గము. మనో వాక్కాయ కర్మలద్వారా భగవత్పరమైన ఒకే పరమ లక్ష్య సాధనకు కృషి చేయడమే చిత్త శుద్ధికి తార్కాణం. మానవుని మనసు బాల్యావస్థలో నిష్కల్మషమైనది. క్రమేపి బాహ్య ప్రపంచంతో సంపర్కం పెరిగిన కొలది విషయ వాంఛలు పెరిగి కామ క్రోధ మోహ లోభాలు ఆవహిస్తాయి. అనేక దుష్కర్మలు చేయడం జరుగుతుంది. కాబట్టి చిత్త నైర్మల్య సాధనకు సతతం ఆత్మావలోకనం చేసికోవలసి ఉంటుంది. కేవలం భౌతిక సౌఖ్యాన్ని వాంఛించే భక్తి భక్తికాదు. సరసమాంబ భక్తి ఆంతరంగిక మైనది, అచంచలమైనది. అమోఘమైనది.

ఫలాపేక్ష రహితమైన భక్తి ముక్తికి తావిస్తుంది. నిశ్చలంగా భగవంతుని సేవించడమే భగవంతునికి మనం సమర్పించుకోగల శాశ్వతమైన కానుక.

"పాపములను జేసి కడు తాప మొందుచుంటినయ్యా
ఓపజాలనింక ప్రాపు జేర్చి బ్రోవకున్న"॥
"భజన చేయుచు నుంటినయ్యా, ఓ పతిత పావనుడా!
నీ పాద కమలములకు"
"ఈ విశ్వమున నేజేయు వింత పాపము ద్రోల"

అంటూ ఆమె ఆత్మావలోకనం చేసికుంటూ పాడుకుంది.

ఆమె ఆత్మావలోకనాన్నే చిత్తశుద్ధికి ప్రధానంగా ఉపయో గించిన సాధనమని స్పష్టపడుతుంది.

నరసమాంబకు ధన కనక వస్తు వాహనాదులు శాశ్వ తానందాన్ని కలుగ చేయలేదు. శాశ్వతానందానికి ఆమె వాటిపై ఆధారపడనూ లేదు. ఆమె మానవ సమాజంలో ఒకర్తె అయినా దానికి అతీతురాలే. ధనాన్ని ఎంత జాగ్రత్తగా సేకరించిందో దానినంత సద్వినియోగం చేసికోవడం మంచిదనుకొంది. కార్యముల యొక్క ఉత్కృష్టతను బట్టి ధనాన్ని దాన ధర్మాలకు వినియోగించడం చాలా అవసరం. నరసమాంబ స్త్రీజాతిలో దాన ధర్మాలకు ప్రసిద్ధి చెందింది. బీద విద్యార్థుల చదువులకు, భగవత్కార్యాలకు పాత్రాపాత్ర ఔచిత్యాన్నిబట్టి దాన ధర్మాలు చేసేది. ఆమె చేసే దాన ధర్మాలు గుప్తంగా ఉండేవి. ఆడంబరంగా నలుగురి నోళ్ళ లోను పడదామనే ఉద్దేశ్యంతో ఆమె ఏమీ చేయలేదు.

ధనం ఒక నిర్ణీత అవధినిదాటి పెరగడంతో అది ఇవ్వ వలసిన శాంతి సౌఖ్యాలకు బదులు అశాంతి, బాధ, ఆత్ర తలను కలుగ చేస్తుంది. పేరాశ, లోభిగుణం, దూబరా ఇటు వంటి అనేక దుర్గుణాలు పుట్టడానికి అవకాశంవుంది. కాబట్టి ధనానికి ఇవ్వవలసిన విలువనే ఇవ్వాలి. ధనం అసలైన విలు వను విజ్ఞానవంతులే గుర్తిస్తారు. లక్ష్మీసరస్వతులు మేళవిం చిన మూర్తి నరసమాంబ కావడం వల్ల ఆమె ధనం సిసలైన

విలువ పూర్తిగా గుర్తించింది. ఆమె ధనం ఆమె ఆముష్మిక చింతనకు ఎన్నడు అడ్డురాలేదు. శ్రీహరి సేవను ఆమె ఎన్నడూ విస్మరించలేదు.

"ఛీ! ఛీ! యని సంపదల రోసి

శ్రీహరి నమ్మి స్మరింపు జీవుడా!" అని ఆమె హెచ్చరించింది.

"కంటె కాసులపేర్లు వెంటరావు మనకు

జంట యెవ్వారు రారు కాదా! అయ్యో

కంటెరె ఈ నగ్న సత్యం—తల్లీ" అని ఆమె నగ్నసత్యాన్ని తన పాట ద్వారా గానం చేసింది.

"ఇహలోక సౌఖ్యంబు లెల్లప్పుడుండవు

ఇకనైన ముక్తిగనండి— అయ్యో

రామనామము పాడరండీ- ఆ

రాముడె మనకెపుడు యిహము పరములండి!"

అని అమె ఉద్బోధించింది.

ఇహ సంపదలు ముక్తి పథానికి దోహదాలు కావాలి కాని, ప్రతిబంధకాలు కాకూడదని ఆమె భావం. ముక్తి మార్గానికి సిరి సంపదలు అవరోధంగా ఉంటే, అట్టివి నరక మార్గానికే హేతుభూతా లవుతాయి. ధనం తాత్కాలికానందాన్ని మాత్రమే ఇస్తుంది అనే విషయాన్ని మరచిపో కూడదు. నరసమాంబ ధనవంతురాలైన కొద్ది వైరాగ్యవంతు

రాలుకూడ కాగలిగింది. గృహకృత్యాలలో నిమగ్నతచూపి ఆదర్శ గృహిణి అనిపించుకొన్నా, ఆమె హృదయం గృహం లోని అంతర్భాగంగా బంధింపబడలేదు. ప్రాపంచిక విషయా లలో శ్రద్ధ చూపినా ఆమె అంతఃకరణ వాటికే అంకితం కాలేదు. భక్తి వైరాగ్య ప్రపూరితమైన ఆమె ధోరణి దానికదే సాటి. సామాన్య సంసార స్త్రీలలో గోచరించని తీవ్ర వైరాగ్య ధోరణి ఆమెలో గోచరించింది. ఆమె మానవ సమాజంలో ఒకర్తె అయినా దానికి అతీతురాలు. కృష్ణ పరమాత్మ గీతలో చెప్పినట్లు ఆమె తామరాకు పైనుండే నీటి బిందువులా నిష్కామకర్మతో తన జీవయాత్ర సాగించుకు పోయింది. మానవ జీవితంలో కలిగే కష్ట నష్టాలు, సుఖాలు, బాధలు, ఆమె. భక్తి వైరాగ్య యుక్తమైన తత్వాన్ని మరికాస్త బలపర్చినవేకాని, దానిని చలింపనివ్వలేదు.



# — 17 —

# తుది రోజులు

కాల చక్రం గిర్రున తిరిగి పోతోంది. రామారావు ఉద్యోగం నుండి రిటైరై ఫించను పుచ్చుకొంటున్నాడు. జగన్నాథం చదువు పూర్తిఅయి న్యాయవాది వృత్తిలో ప్రవేశించాడు. జగన్నాథం ఉన్నత శ్రేణిలో పరీక్షలలో ఉత్తీర్ణుడవడం నరసమాంబకు చాలా సంతోషం కలిగించింది. కుమారుడు న్యాయవాది వృత్తిలో ప్రవేశిస్తే స్వతంత్రజీవనం చేసుకుంటూ తన వద్దనే వుంటాడనే ఉద్దేశ్యంతో నరసమాంబ జగన్నాథాన్ని 'లా' చదివించింది. ఆమె ఆశయం సిద్ధించి కొడుకు వృత్తిలో ప్రవేశించిన కొద్ది కాలానికే ఉన్నత స్థాయినందుకున్నాడు. కుమారుని పేరు ప్రఖ్యాతులు ఆర్జన చూచి ఆమె అమితానందాన్ని పొందింది. వెంకట మామయ్యను మించినవాడయినాడనుకొంటూ సంతోషించేది. జగన్నాథం పార్టీలు పూతచుట్టలు, కూరగాయలు, పాలు, పండ్లు తెస్తే వాటిని చుట్టుప్రక్కల వారికి పంచిపెట్టుకొని బ్రహ్మానందం పొందేది.

స్వజనం, స్వగృహం వీరిమధ్య సంతోషంగా ఉండడంకంటె ఆమెకు కావలసిందేముంది? సంఘంలో గౌరవ ప్రతిష్టలు పెరిగాయి. ఐశ్వర్యానికి లోటులేదు. ఇన్ని ఉన్నా ఆమెకు ఒక్కొక్కప్పుడు తీవ్ర మనోవేదన కలిగేది. కల్మషపూరితమైన సంఘాన్ని తలచుకొంటె ఆమె మనసు కలవర పడేది.

ఆమెలో క్రిమేపి ఒకవిధమైన ఆత్మజిజ్ఞాస పెరిగింది.‘ ఎందుకు పుట్టాం? జీవిత లక్ష్యం ఏమిటి?’ అంటూ ఆమె అనేక విధాలుగా తర్కించుకొనేది. లేవడం, తినడం, పడుకోవడం నిర్వ్యావధిగా నిత్యం జరిగించుకొని పోయే మానవ జీవితంలో ఆమెకు నూతనత్వం గోచరించడం మానివేసింది.

అది చైత్ర శుద్ధ పంచమి. జగన్నాథం పుట్టినరోజు. నరసమాంబకు పుట్టిన రోజులు చేయడం అంటే ఎంతో సరదా. ప్రతి బంధువు పుట్టినరోజు ఆమెకుజ్ఞాపకమే. ఆరోజు ఉదయాన్నే జగన్నాథానికి అభ్యంగన స్నానం చేయించి నూతన వస్త్రాలు కట్టబెట్టి, పెందరాళే పిండి వంటలు వండి వడ్డించి పెట్టింది. ఆమెకు స్వయంగా వడ్డించడమే ఇష్టం. ‘తప్పకుండా ,నీకు సంతానం కలుగుతుంది’ అని కొడుకుని ఆశీర్వదించింది. ఇంట్లో మనుమలు లేనిలోటు ఆమెకు ఎప్పుడూ కనిపిస్తూనే వుండేది. ఎప్పుడు మనుమల నెత్తుకొం దామా? అని ఆసించడం సహజమే కదా! ఆ దినం కులాసాగా గడిపింది. రాత్రి ‘భూకైలాస్’ చలన చిత్రం సకుటుంబముగా చూచింది. చాలా మెచ్చుకుంది. నీతిదాయకమైన కథ, శ్రావ్యంగాపాడిన పద్యాలు ఉన్న ప్రదర్శనాలు ఆమెకు నచ్చేవి. సంతోషంతో ఆ రోజు గడిచిపోయింది.

మరి రెండు రోజులు గడిచాయి. రోజు ప్రకారమే నరసమాంబ రాత్రి ఇంట్లోనివారికి, వచ్చిన బంధువు మాల

తికి భోజనాలు స్వయంగా వడ్డించింది. భోజనాలయ్యాక మాలతితో కాసేపు పిచ్చాపాటి మాట్లాడింది. శ్రీరామ నవమి పండుగకు ముందే ఊళ్లో ఉత్సవాలు ప్రారంభం అయ్యాయి. హరి కథలు జరుగుతున్నాయి. హరికథలంటే నరసమాంబకు చాలాఇష్టం. "ఈ రాత్రి హరికథకు వెడదాం. ఈ లోగా కాసేపు విశ్రమించు" అని మాలతితో చెప్పి నరస మాంబ ప్రక్కపై పడుకుంది. రాత్రి తొమ్మిది గంటలు దాటింది.

"హరికథకు వెడతానన్నావు, టైం అయింది వెళ్ళ వేం?" అని ప్రశ్నించాడు రామారావు.

"కడుపులో విపరీతంగా పోట్లు వస్తున్నాయి వెళ్ళలే నండీ" అంది నరసమాంబ. ఆమె ఆ మాటలు అనే వరకు పోట్లతో బాధపడుతున్న సంగతి ఇంట్లో ఎవరికి తెలియనే తెలియదు. ప్రక్క వారికి నిద్రాభంగం అవుతుందేమోనని బాధనంతా దిగమింగుకొని పడుకుంది. ఎంత బాధకలిగినా అమెలో ఆమె సహించి ఓర్చుకొని ఊరకుండేదే కాని ఇంట్లోని వారిని కలవరపెట్టి ఎరుగదు.

"పోనీ డాక్టర్ని పిలుచుకురానా ?" అన్నాడు రామా రావు.

"ఇప్పుడేమీ అక్కరలేదు. అవసరమైతే ప్రొద్దుట చూచుకుందాం. మీరు నిద్రపొండి" అంది నరసమాంబ.

తెల్లవారినా బాధఏమీ తగ్గలేదు. పొత్తికడుపుకొంబ్బ రికాయంత వాచింది. డాక్టరు వచ్చి పరీక్షించి ఏదో మందు ఇచ్చి వెళ్ళాడు. రెండు రోజులైనా బాధ యథా ప్రకారంగానే ఉంపి. వాపు తియ్యలేదు.

"పోనీ స్థానిక ఇటాలియన్ ఆసుపత్రిలో చేర్పిస్తే బాగుంటుంది. నర్సులు మొదలైన ఆడవారి సహాయం ఉం టుంది" అని సూచించాడు డాక్టరు. నరసమాంబ దానికి వెంటనే సమ్మతించింది. ఆ రోజు శ్రీరామనవమి పండుగ దినం. నరసమాంబ లేతగులాబీ రంగు చీర కట్టుకొని అంత బాధలోను తనంతతాను చర చరా మేడ మెట్లు దిగి రిక్షాలో ఆసుపత్రి చేరుకొంది. ఆమె ఊళ్ళో రిక్షా ఎక్కి వెళ్ళినది, ఆరోజుననే. ఓపిక ఉన్నంత వరకు నడవడమే కాని వాహ నాలు ఎక్కి ఊళ్ళో తిరగడం అంటే ఆమెకు ఇష్టం ఉండేది కాదు.

ఆసుపత్రిలో నరసమాంబకు ఒక ప్రత్యేకమైన గదిని కేటాయించి యిచ్చారు. గాలి, వెలుతురు బాగా వచ్చే సువిశాలమైన గది అది. ఆగదిలో ఆమె ప్రక్కకు ఎదు రుగా గోడమీద శిలువ వేసియున్న ఏసుక్రీస్తు చిత్రం ఉంది. దానికి ఆమె మ్రొక్కింది. అది ఆమె సర్వమత సమానత్వా నికి చిహ్నం. ఆసుపత్రిలో చేరిన రెండు రోజులకు శస్త్ర చికిత్స అవసరం అన్నాడు డాక్టరు.

"పోనీ విశాఖపట్నం వెళదామా?" అన్నాడు జగన్నాథం.

"దూర ప్రయాణం చేయలేను. నాకు ఇక్కడే ఆపరేషన్ చేయించండి" అంది నరసమాంబ. ఇంట్లోని వారికి ఎంత స్వల్పరోగం వచ్చినా పెద్దపెద్ద ఆసుపత్రిలలో చికిత్సకై పొరుగూళ్ళు పరుగెత్తే ఆమె, తన స్వంత చికిత్సకు పొరుగూరు వెళ్ళడానికి ఇష్టం చూపలేదు. భీమవరంలోనే నరసమాంబకు శస్త్ర చికిత్స జరిగింది. కోలుకుంటున్నట్లే కనిపించింది ఒకరోజు అంతా. క్రిమేపీ ఆమెకు స్పృహతప్పింది. తాను రోగులకు ఎంత సేవ చేసినా, తాను రోగంతో ఉంటే ఇతరులను తనని ముట్టుకోనిచ్చేది కాదు తన వ్యాధి, వారికి ఎక్కడ సోకుతుందో అనే భయంతో. ఆరోజు నరసమాంబ ఆత్మీయులు సోకినా అభ్యంతరం చెప్పలేదు. దానిని బట్టియే ఆమె పూర్తి వ్యక్తతలో లేదని తేలిపోయింది. ఆపూర్తివ్యక్తత లేని స్థితిలోకూడ "అబ్బాయి క్రిందకువెళ్ళి చదువుకో" అంది పరాకుగా. ఆమెపలవరించినమాటలుఆమెవిద్యానిరతికిచిహ్నం. ఆమెకుకాఫీనీళ్లైనాఇవ్వడానికినోచుకోలేదుచుట్టువున్న పరివారం

అసలు ఆ వ్యాధి ప్రవేశించినది లగాయతు ఆమెకు జీవిస్తాననే ఆశలేదు. జీవించాలని అభిలషించ లేదు కూడా. సంసారంతా హాయిగా సుఖంగా ఉంటుండగా ఈ లోకం విడిచి కృష్ణపరమాత్మ సాన్నిధ్యం చేరుకోవడం కంటె నాకు

కావలసినదేముంది ?" అనేది ఆమె. ఆమె చావునకు భయ పడలేదు. మృత్యువును ఆహ్వానించుకొంది కూడ.

క్రిమేపీ శ్వాస బరువెక్కింది. అఖండ ధైర్యంతో అతి తెలివితేటలతో బ్రతికిన ఒకనిర్వాకస్థురాలి తుదిగడియ లవి. సహజ పాండిత్యం, కవితా ధోరణి కలిగిన సరస్వతి స్వరూపిణి ఆఖరి రోజది. చిల్లిగవ్వ లేకుండా ప్రారంభించిన సంసారానికి సకలైశ్వర్యాలు సమకూర్చిన గృహలక్ష్మి అంతిమ క్షణాలవి. పేరు ప్రతిష్ఠలు, సంఘగౌరవం, మర్యాద సమకాలికుల జోహార్లు అందుకున్న కీర్తి కాముకి అవసానదశ అది. భక్తి వైరాగ్యాలు ప్రభోధించి చిత్తశుద్ధి కలిగిన స్త్రీరత్నం కృష్ణసాన్నిధ్యాన్ని చేరుకోబోయే తుదిఘడియలవి. అప్పుడే వచ్చాడు దూరగ్రామం నుండి సోదరుడు జనార్దనం. భర్త, కొడుకు, కోడలు, పరివారం చుట్టూ వున్నారు. నరస మాంబ విలంబి నామ సంవత్సర చైత్ర శుద్ధ చతుర్దశినాడు [2-4-1958] శాశ్వతంగా కళ్ళు మూసింది. నరసమాంబ భౌతిక దేహం ఇక మానవ లోకంలో లేదు. ఆమె భగ వంతునిలో ఐక్యమై దివ్య జ్యోతిగా వెలుగొందుతూ ఉంది. మాతృమూర్తి మాతృదేవత అయింది.

# జో హోర్లు

నరసమాంబ ఇహలోకం విడచి కృష్ణ భగవానునిలో లీనమై రోజులు గడచిపోతున్నాయి. తల్లి లేకపోవడం జగన్నాథంకు తీరనిలోటు. ఆమె నిష్కపట నిర్మల హృదయాన్ని నిరాడంబర జీవితాన్ని, పవిత్ర శీలాన్ని, జగన్నాథం ఎప్పుడూ తలచుకుంటూనే ఉంటాడు. శ్రమ జీవిని, కవయిత్రి, మహా భక్తురాలు, ప్రేమ స్వరూపిణి, తీవ్ర విరాగిణి అయిన తన మాతృదేవత చరిత్రను తలచుకొని శోకించాడు జగన్నాథం. ఆ శోకమే ఈ రచనకు నాంది. ఆమె తన సర్వస్వాన్ని తనకు దత్తం చేసింది. ఆమె రచించిన కొన్ని పాటలు, పద్యాలు "భక్తి భావ తరంగిణి" అను పేర ముద్రించుకొని గానం చేసుకున్నాడు. ఆదర్శ గృహిణి అయిన నరసమాంబ పేరును బంధు మిత్రులు తమ బిడ్డలకు పెట్టుకొన్నారు. అనేక నరసమాంబలు వెలిశారు.

మాతృ ఋణాన్ని జగన్నాథం ఎన్నడు తీర్చలేడు. తాను చేయగలిగిన దంతా ఆమె చూపించిన మార్గంలో తన జీవయాత్ర గడుపుకొని పోవడం ఒక్కటే. ఆమె నామం 'నరసమాంబ' అతని పంచాక్షరి. కవి సార్వభౌముడు నరసమాంబ జన్మ దినోత్సవ సందర్భంలో చెప్పిన దిగువ ఉదహరించిన "నవరత్నాలు" జగన్నాథం కంఠస్తం చేసుకున్నాడు.

నిత్యం స్తోత్రం చేస్తున్నాడు. ఆదర్శ మహిళకు, మాతృదేవతకు అతను అందచేసిన జోహార్లు అవే.

1. ఉక్త్వా జీవితనాటకస్య చరమా మోంతత్సదిత్యుత్తమా
ముక్తి ముక్తి మితోగతాధికధియా దేహంపరిత్యజ్యయా
సా లక్ష్మీ నరసాంబికా విజయతే జ్యోతిస్వరూపాపర
బ్రహ్మానంద సుఖానుభూతి వశతో దేదీప్యమానాధునా॥

(జీవిత నాటక రంగమున 'ఓం తత్ సత్' అను చరమ సూక్త ముతో దేహమును పరిత్యజించి ముక్తినందిన 'నరసమాంబ' జ్యోతీ రూపమున బ్రహ్మానంద సుఖము ననుభవించుచు దేదీప్యమానమై విరాజిల్లు చున్నది)

2. శార్వర్యాహ్వయవత్సరే మృగశిరోమాసేఽసితే సప్తమీ
తిథ్యాం చచ్ఛుభవాసరే సముదితా శ్రీరాణ్మహేంద్రపురే
మాతా శ్రీపులుగుర్త కన్కమ సతీ సీతాపతిస్త్విపితా
భ్రాతా వైద్యమణిర్జనార్దన ఇతి ఖ్యాతస్తుతస్యాభువి॥

(శార్వరి మార్గశీర్షమున కృష్ణ సప్తమినాడు శ్రీ రాజమహేంద్రపురవరమున శ్రీపులుగుర్త సీతాపతి కనకమ్మల చిర తపఃపుణ్య ఫల లక్ష్మిగా జన్మించి భిషగ్వరుడుగా వాసి గాంచిన జనార్దనుని సహోదరి అయినది)

3. జనయిత్రీవ శ్రీనరసాంబాకవితా విశారదా సుబహూన్
గ్రంథాంశ్చకార విద్వల్లోకస్తాంస్తౌతి సత్కవిత్వమణిరితి॥

(లక్ష్మీ నరసమాంబ ప్రసూస్త్యముతో బాటు కవితా

మధువును గూడ గ్రోలి జనయిత్రివలె కవయిత్రియై తన గ్రంథ రచనా వైశారద్యముచే విద్వదవతంసుల స్తవనముల నందినది)

4. పురాణానామష్టాదశగుణ గతానాంగుణవతీ
సతీసానర్సాంబా నిరతపఠనా ద్ధీబలయుతా
ఉపన్యాసేవేద్యాం బహు బుధగతాయాం పరిషది
ప్రవీణా వీణాయారణనమివ తత్కంఠరణనమ్॥

(సద్గుణ వతియు సతియునైన నరసమాంబ నిరంతర పురాణ పఠనా వ్యాసంగములచే ధీశాలిని అయినది. ఉపన్యాసములలో పారిషద బుధులను తన కంఠరణనములచే ముగ్ధులను గావించుటలో ప్రవీణ)

5. భక్తిభావ తరంగిణ్యో పద్యగీతాది పంక్తయః
తజ్జల్పితేషు గ్రంథేషు దృశ్యంతే పండితైస్సదా॥

(ఆమె గ్రంథములోని భక్తి భావ తరంగిణులు పండితులకు పరిదృశ్య మానము లగుచున్నవి)

6. తజ్జల్పితాని పద్యాని గీతికాదీని సాంప్రతమ్
భక్తిభావ తరంగిణ్యా నామ్నా ముద్రాపితాన్యహో॥

(ఆమె రచనములలోని కొన్ని పద్యగీతికలు 'భక్తి భావ తరంగిణి' యను పేర ముద్రితములై ప్రకటితములు)

7. తన్మతా కనకాంబికేవనిరతాసా రాజకీయోల్లాస
ద్రంగేషు ప్రతిభాంచితా ప్రతిపదే సత్యాగ్రహాంకుర్వతీ

దేశేనాయక సంస్తుతాఽభవదరం మాతా జగన్నాథ రా
డ్యం. యే.బి.యసి. బీయలాహ్వాయ సమాఖ్యాతస్యవిద్వన్మణేః॥
(లక్ష్మీ నరసమాంబ తనతల్లియగు కనకమ్మవలె రాజకీయాది
బహు రంగములలో ప్రతిపద సత్యాగ్రహంతో నాయకుల
మన్ననలందిన వీరాంగన. న్యాయవాది జగన్నాథరావు
ఆమె కుమారుడు.)

8, భీమవరే మహిళానాం సంఘం సంస్థాప్య నరసాంబా సా
తాసాం విజ్ఞాన కళా మదదద్దివ్యోపదేశవశాత్॥
(దివ్యోపదేశముచే నరసమాంబ భీమవరం మహిళల కొక
సంఘమును సంస్థాపించి విజ్ఞాన కళాదాయిని యగుట స్థానికు
లకు తెలియనిది కాదు)

9. ఋతుబాణాజవసుంధరా కలిత హాయనాబ్దే నృసింహాంబికా
వరభీమాఖ్యపురీవరే మ్యునిసిపల్ సభ్యత్వ మాప్యాన్వహమ్
పురవృద్ధ్యర్థ మతీవ కష్టసహనా సేవాం సదాకుర్వతీ
బహుళఖ్యాతిమవాప సర్వమహిళా మధ్యేమహాజోగుణాత్॥
(1956 వ సంవత్సరములో నరసమాంబ స్థానిక పురపాలక
మండలిలో స్త్రీలకై ప్రత్యేకింప బడిన స్థానమునకు పోటీలే
కుండా ఎన్నుకొనబడి పట్టణాభి వృద్ధికి సదా పాటుపడి యశో
స్సగాంచుట స్త్రీజాతి కెంతయో గర్వకారణము)

